# స్రవంతి

## సాహిత్య మాస పత్రిక



దక్షిణ భారత
హిందీ ప్రచార సభ-
ఆంధ్ర, హైదరాబాదు.



సాహిత్య మాస పత్రిక

# 415

నవంబరు, 1988

వార్షిక చందా : పదిహేను రూపాయలు

సంపుటి : 35 సంచిక 8

విడిప్రతి :రూపాయిన్నర

# ఈ సంచికలో

సంపాదకీయం :

# ఆంధ్రసభ స్వర్ణోత్సవాల

దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర స్వర్ణోత్సవాలు 1988 అక్టోబర్ 22, 23 తేదీలలో హైదరాబాదులో వైభవంగా జరిగాయి. గత 52 సంవత్సరాలుగా ఆంధ్రసభ సేవాకార్యక్రమాల సింహావలోకనం, భవిష్యత్ సేవా కార్యక్రమాలపై దృష్టిప్రసారం చేయడానికి ఈ ఉత్సవాలు తోడ్పడ్డాయి. ఆంధ్రసభ గతంలో రజతజయంతి ఉత్సవాలు జరుపుకొన్నది. శ్రీ లాల్ బహాదుర్ శాస్త్రిగారు వాటికి అధ్యక్షత వహించగా డా. సర్వేపల్లి రాధాకృష్ణన్ గారు ప్రారంభించి ఉన్నారు. ఇప్పుడు స్వర్ణజయంత్యుత్సవాలను భారత ఉపరాష్ట్రపతి గౌ॥ డా॥ శంకర్ దయాళ్ శర్మగారు ప్రారంభించినారు. భారత విదేశాంగమంత్రి గౌ॥ శ్రీ పి. వి. నరసింహారావు గారు ప్రారంభోత్సవసభకు అధ్యక్షత వహించగా ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గౌ॥ శ్రీ యన్. టి. రామారావు గారు స్వర్ణోత్సవ స్మారిక 'ఆంధ్రదర్శన్'ను ఆవిష్కరించారు. మొదటిరోజు మధ్యాహ్నం అఖిల భారత భాషాసమ్మేళనం, రాత్రి అఖిల భారత భాషా కవి సమ్మేళనం, రెండవరోజు ప్రచారక సమ్మేళనం. సన్మానకార్యక్రమాలు జరిగినవి.

ఈ స్వర్ణోత్సవాల ప్రారంభసభ వైభవంగా, ఉల్లాసకరంగా, ఉత్సాహవర్ధకంగా పతాకస్థాయిలో జరగడం ప్రధానమైన విశేషం. ఈ సభ జరిగిన గాంధీ భవన్ సమావేశమందిరం రాష్ట్రం నలుమూలల నుండి వచ్చిన హిందీప్రచారకులతోను విద్యార్థులతోను, దేశంలోని హిందీసంస్థలనుండి, హైదరాబాదులోని సంస్థలనుండి వచ్చిన అభిమానులైన పెద్దలతోను పూర్తిగానిండి నయనానందకరమైన దృశ్యం ఏర్పడింది.

ఈ సభలో మాట్లాడినవారందరు దక్షిణభారత హిందీ ప్రచార సభ ఇంతవరకు హిందీభాషా ప్రచారప్రసారాలకు చేసిన మహత్తర కృషిని సమీక్షించి ఇక కాలానుగుణంగా ఆధునికదృష్టితో తన భవిష్యత్ కార్యక్రమాలను ప్రణాళికలను రూపొందించుకోవలసిన అవసరాన్ని నొక్కిచెప్పారు. సభ ఒకవంక జన

బాహుళ్యాన్ని హిందీవైపు ఆకర్షించి ప్రచారం చేయటంతోపాటు ఉచ్చశిక్షా ఔర్ శోధ్ సంస్థాన్ ద్వారా పోస్ట్ గ్రాడ్యుయేట్ స్థాయిలో ప్రయోజనవంతమయిన కార్యక్రమాలను చేపట్టి నిర్వహిస్తున్నదనీ ఇది ఈ సభ జాతీయ భావావిష్టతకు, ఆధునికదృష్టికి, సజీవతకు ప్రమాణమని ప్రశంసించారు భవిష్యత్తులోకూడ ఈ రెండువిధాలయిన కార్యక్రమాలను నిర్వహిస్తూ పురోగమించగలదని దృఢమయిన విశ్వాసాన్ని వ్యక్తం చేశారు. ఈ సందర్భంలో ఉచ్చ శిక్షా ఔర్ శోధ్ సంస్థాన్ కంప్యూటర్ లో బహుభాషాశిక్షణవిషయంలో సాధించిన పురోగతిని ప్రత్యేకంగా పేర్కొని కొనియాడటం జరిగింది.

రెండవరోజు ఉత్సవాలలో భాగంగా ప్రచారకుల సన్మాన కార్యక్రమాలు జరిగినవి. ఈ సందర్భంలో దక్షిణాదిన హిందీ ప్రచారోద్యమానికి మూలస్తంభాలలో ఒక్కరై దక్షిణభారత హిందీ ప్రచారసభకు చిరకాలం ప్రధానకార్యదర్శిగా వ్యవహరించిన శ్రీ మోటూరి సత్యనారాయణగారిని సభకు జాతీయ ప్రతిపత్తిగల సంస్థగా పార్లమెంట్ గుర్తింపులక్ష్యమై తద్వారా ఉచ్చశిక్షా ఔర్ శోధ్ సంస్థాన్ సాధనకు అవిరళకృషి చేసిన శ్రీ డి. శ్రీనివాస అయ్యంగారిని ప్రత్యేకించి సన్మానించడం ఉత్సవాలకు సార్థకత చేకూర్చింది.

దక్షిణాదిన మనం అంటే హిందీప్రచారకులం సభ స్థాపింపబడిన నాటి నుండి నేటివరకు హిందీప్రచారానికి అంకితమై ఉన్నాము. ఎన్ని ఒడిదుడుకులు వచ్చినా మనం మన దీక్షను విడనాడలేదు. ఇక మన భవిష్యత్ జీవితంలోకూడ ఈ దీక్షను విడనాడబోము. వందేళ్ళు బ్రతికినా హిందీప్రచారమే చేస్తాము అన్న పి. వి. నరసింహారావుగారి మాటలలో మనఅందరి దీక్ష సంకల్పం ప్రతిధ్వనించి విన్పించిన ఈ స్వర్ణోత్సవసభలు హిందీ ప్రచార ప్రసారాలకు నూతన స్ఫూర్తిని సమకూర్చగలవని విశ్వసిస్తున్నాము.

ఈ స్వర్ణోత్సవాలను విజయవంతమొనర్చుటకు ఆంధ్రసభ కార్యనిర్వాహక సమితి సభ్యులు, కార్యకర్తలు, హిందీప్రచారకులు, అభిమానులు, విద్యార్థులు సావనీరుకు ప్రకటనలిచ్చిన సంస్థలవారు, వ్యాసములను పంపి సహకరించిన రచయితలు—అందరూ...ఎందరో...అందరికీ కృతజ్ఞతాభివందనలు.

# దాశరథికి శ్రద్ధాంజలి

(నవంబరు 5, 1988 మహాకవి డా. దాశరథి ప్రథమ వర్ధంతి)

— తిరుగరి

అన్నా దాశరథీ!
నువ్వెళ్ళి పోయి
అప్పుడే అబ్దం గడిచిపోయింది
ఐనా నువ్వు మా కళ్ళముందు
నడయాడుతున్నట్టే అన్పిస్తోంది

రవీంద్ర భారతిలో
సారస్వత పరిషత్తులో
కృష్ణదేవరాయాంధ్రభాషా నిలయంలో
త్యాగరాయ గానసభలో
సభలకూ సమ్మేళనాలకూ
అధ్యక్షిస్తూ మధురమధురంగా
సంభాషిస్తున్నట్టుగానే వుంది.
కమ్మగా గొంతెత్తి కవితాగానం చేస్తున్నట్టేఅన్పిస్తోంది

నువ్వు పెంచిన నవ్యాంధ్ర కవితా నందనంలో
అందంగా విరిసిన ఈ పువ్వుల్ని చూసి
అమృతహాసం చిందుతున్నట్టుగానే వుంది
నువ్వు వెలిగించిన శతసహస్రకవితాదీపాల
కాంతిచ్ఛటల్ని చూసి

పరవశించి పాడుకుంటున్నట్టుగానే వుంది
మహాకవీ దాశరథీ!
నీజ్ఞాపకాలు
మా గుండెల్నింకా చెరువుల్ని చేస్తూనే వున్నై
నువ్వులేని కవితా లోకాన్ని

ఊహించుకోలేకపోతున్నాం
ఎలా ఊహించుకొమ్మంటావు?
మూడు కోట్ల ఆంధ్రుల నొక్క
ముడిలో బిగించిన నీ పద్యాన్ని
ఎలా మరచి పొమ్మంటావు?

నిజాం అవినీతి పాలనపై అగ్నిధారలు పారించిన
కోటి తెలుగులను మేల్కొల్పగా రుద్రవీణలు మీటిన
మహాంధ్ర గీతాలు శ్రావ్యంగా ఆలపించిన
నీ త్రివిక్రమ స్వరూపాన్ని
ఆంధ్రదేశం ఎలా విస్మరిస్తుంది?
నీ లేఖినిలోంచి జారిన ప్రతి పద్యం
కలకాలం తెలుగులకు

వెలుగు బాటలు చూపుతుంది
తెలుగు ప్రజావళి హృదయాల్లో నీతేజం
అక్షరమై అక్షయమై నిలుస్తుంది
సదా మా హృదయాల్ని కదిలిస్తుంది
నీ కమ్మని కవిత్వం
సర్వదా మమ్మల్ని ముందుకు నడిపిస్తుంది
నీ అమృత హృదయం

అన్నా దాశరథీ!
నీ వర్ధంతి వేళ
అందుకోవయ్యా ఈ తమ్ముడు
సభక్తికంగా సమర్పించే శ్రద్ధాంజలి!!

తిరునగరి, ఎం.ఏ బి.ఓ.ఎల్.
కవితా సదనం,
పోచమ్మవాడ, ఆలేరు-508101
నల్లగొండ జిల్లా.

# కళ్ళు

— రుద్రశ్రీ

అందమవే వెన్నెల్లో
స్నానాలు చేస్తున్నాయి కొన్ని కళ్ళు
మూగ భాషతో
ముగ్ధ భావంతో
రంగు రంగుల రాగాలతో
రసగీతాలు పాడుతాయి మరి కొన్ని కళ్ళు
పెళ్ళినాటి కళ్యాణవేదికలోని కళ్ళ చూపులు
చెలియలికట్టపై ఆటుపోటు లాంటిది
అమృతం పోసి పండిన పాయసంలాంటిది
అనుపమ అమ్మ వాత్సల్యపు కళ్ళ చూపు
అక్షికవాటం నుండి అగ్నిజ్వాలలాంటి మరికొన్ని
ఆ చూపులు ఎదుటివాన్ని దహిస్తున్నాయి
ఏకాంతంలో ఉరిత్రాటిపై ఉన్న పతిత చూపుల్నుండి
ఎన్నో తుఫానులు లెగుస్తున్నాయి
కొన్ని దొరచూపులు అందాన్ని దోచుటకువెళుతున్నాయి
ఇంకొన్ని దొంగచూపులు దొడ్డిదారిన పరిగెడు
తున్నాయి.
బీటలు వారిన హృదయం నుండి ఒక చూపు
శూన్యంలోకి పరుగు తీస్తుంది
బొమముడి నుండి అంధుని చూపు శబ్దంవైపు
ఉరకలు వేస్తుంది
వింత వింత చూపు లెన్నో మూగబాస కవితను
వ్రాస్తున్నాయి
వినిమీలిత సూక్ష్మదృక్కోణం సహస్రారంలోకి
పరుగు తీసుంది

8-6-67 గణేశ్ స్ట్రీట్
జగగామ్-506167
వరంగల్ జిల్లా (ఏ.పి.)

# రెండు కవితలు

నివేదన: ఇసుకపల్లి సీతారామాదేవి

అనంతమైన చీకటి ఆవరించి
అగమ్య గోచర సంద్రంలో నావలా
ఘోషిస్తోంది నా మనస్సు
భరింపరాని శూన్యం ఆవహించి
శరదృతువులో శోభావిహీన వృక్షంలా
క్షోభిస్తోంది నా హృదయం
నా బ్రతుకుకుండలో లేదు
ఒక్క సంతోషపు నీటి బిందువు
నా జీవన రహదారి మీద నడవటం లేదు
ఒక్క ఆనందపు శకటం
నువ్వు నిజంగా నా నేస్తానివే అయితే
నా బ్రతుకునావ తీరం చేరేందుకు
కాల కడలిలో దీపస్తంభాన్ని సృష్టించు!
నా జీవన వృక్షాన్ని చిగురింపజేసే
వసంతాన్ని తోడ్కొనిరా!

## ఊహ

ఊహల తోటలో విహరిస్తున్న వేళ
కవి 'భావనా శక్తి' అనే మంత్రదండం తాకించి
అక్షర మొగ్గలని
పదాల రేకులు తొడిగి వికసింపజేస్తాడు
రసప్రియులకు కనువిందుగావించే
పసందైన శృంగార భావాల గులాబీలుగా
ప్రకృత్యారాధకుల హృదయాల నలరించే
ప్రకృతి వర్ణనల మల్లెలుగా
భావుకుల మనస్సుల నాకర్షించే
భావోద్వేగ గీతాల సంపెంగలుగా
కవితా సౌరభం వెదజల్లుతూ
అందరి హృదయాల నలరిస్తాయి
ఆ బాలగోపాలాన్ని మురిపిస్తాయి.

ఆంధ్రా బ్యాం
విద్యానగర్ బ్రాంచ్, హైదరాబాదు.

# హితబోధ

—సుశర్మ

తే. క్రూరులగు టెర్రరిస్టుల ఘోర కృత్య
ములను తలపోసి తద్దయు కలతవారె
భారత ప్రజ, కన్యాకుమారి నుండి
అవల కాశ్మీర దేశ పర్యంతముగను.

తే. హస్తినాపురి గాంధీ జయంతినాడు
పొదల దాగిన యొక నీచు పూన్కి జేసి
భయపరివృతుండగు ప్రధాని భద్రతకును
ముప్పువాటిల్లెననినేమి చెప్పవలయు.

తే. కారులో నెక్కి పూనా బజారునందు
పోవు జనరలు వైద్యను పొట్ట బెట్టి
కొనియె, టెర్రరిస్టుల తుపాకులు క్షణమున
ఏమి కానున్నదో దేశ మిట్టి యెడను.

తే. మొన్న జనరలు వైద్యకు మూడెనకట
నిన్నడీయస్పి నిహతుడై కన్ను మూసె
నేడు సర్కిలు బలియయి నీల్గినాడు
ఏమి కానున్నదో దేశమిట్టి యెడను.

తే. విశ్వమంతట హైజాకు వెర్రిపట్టె
రైళ్ళ దోపిడి నిత్యము రగులుచుండె
బస్సు లూటీలు చేయుట ఫాషనయ్యె
మానభంగములన్న సామాన్యమయ్యె!

తే భావి భారత ప్రజలు బాధ్యత గొని
దేశమును చక్కదిద్దు నుద్దేశమెసగ
ఈ దురాగతముల నెల్ల నెసగనీక
జాగరూకులై యుండుట చాలమేలు.

ప్రధాన కార్యదర్శి
నన్నయ భట్టారక పీఠం
తణుకు

# సూర్యునికి—"పద్మశ్రీ"

—కనపర్తి రామచంద్రాచార్యులు

ఎప్పుడు,
ఈ ఉద్యోగాని కెక్కావో కాని-
ఒక్కనాడు సెలవు తీసుకొన్నది లేదు;
ఆలస్యంగా వచ్చింది లేదు;
సమయానికల్లా—
తూరుపు కొండ కుర్చీపై
ఎక్కికూర్చుంటావు
ఎప్పుడో...
నీ విధ్యుక్త ధర్మానికి అటంకంగా, ఒక పతివ్రత
ధర్నా జరిపితే జరుపవచ్చుగాక —
ప్రతిఫలాపేక్షలేని
'నిస్వార్థపు' సేవ నీది !
అగ్రవర్ణు లందించే
అర్ఘ్యాది వందనాలు తప్ప—
నీవు పుచ్చుకొనే 'లంచం' ఏది?
ఎక్కడ, ఎవ్వరు ఏం చేస్తున్నదీ
కనిపెట్టే కర్మసాక్షివి
మా 'అధికార వర్గ' మంతా
నిన్ను 'ఆదర్శం'గా తీసుకొంటే ఎంత బావుండు.
ఇన్నాళ్ళ నుంచీ డ్యూటీ చేస్తున్నా-
ఇంకా 'ఉడుకు' తగ్గలేదు?
సహస్రకరాల సత్తువ సన్నగిల్ల లేదు?
వెన్నెల నవ్వుల్ని కురిపించే
ఆ 'రాజు' కన్నా-
ఏ 'మచ్చా' లేని నీవే నా ఆదర్శం?
ఏ 'కుముద' హృదయాలు
ముడుచుకొంటే ఏం?
ఏ మందేహులు నీపై
శత్రుత్వం వహిస్తే ఏం?
పద్మాలను, ప్రజాహృదయ పద్మాలను
వికసింప జేసే నిన్ను
'పద్మశ్రీ' తో సత్కరిస్తున్నాను.

ఇంటి. నం. 7-8-66, గంజురోడ్,
సిద్దిపేట-502103.



# సాహిత్య అకాడెమీ
# ఇటీవల వెలువడిన ప్రచురణలు

| | | |
|---|---|---|
| * విశ్వకవి (రవీంద్రనాథ్ టాకూర్ జీవితచరిత్ర) | —డా॥ సి. ఎన్ శాస్త్రి "అమరేంద్ర" | రూ. 20 |
| * సమాజపు కోరల్లో (తమిళ నవల) | —అను. మాలతీ చందూర్ | రూ. 25 |
| * జనవాహిని (అస్సామీ నవల) | —అను. డా. సి. ఎన్. శాస్త్రి 'అమరేంద్ర' | రూ. 30 |
| * తెలుగు కథ | —సంపా. డి. రామలింగం | రూ. 40 |
| * నగర మథనం (డోగ్రీ నవల) | —అను. ఎన్. సి. రామానుజాచారి | రూ. 12 |
| * తలపుల దుమారము (2వ ప్రచురణ) | —మౌలానా అబుల్ కలామ్ అజాద్ | రూ. 15 |
| * మట్టిదీపం (తమిళ నవల) | —యమ్. వరదరాజన్ | రూ. 25 |
| * మరాఠీ కథా సంగ్రహము | —సంపా. ఎ. కె. భగవత్ | రూ. 15 |
| * తెలుగు కావ్యమాల | —సంపా. కాటూరి వేంకటేశ్వరరావు | రూ. 30 |
| * కావ్యమాల (స్వాతంత్ర్యానంతర తెలుగుకవిత) | —సంపా. దేవులపల్లి రామానుజరావు | రూ. 25 |
| * తమిళ వాఙ్మయ చరిత్రము | —యమ్. వరదరాజన్ | రూ. 25 |

"భారతీయ సాహిత్య నిర్మాతలు శీర్షికలో" ఒక్కొక్క ప్రతి రూ. 4/-

* భారతి * భారతేందు హరిశ్చంద్ర * బుద్ధదేవబోస్ * జ్ఞానదేవుడు * కల్హణుడు * గురజాడ * మహాకవి ఉళ్ళూర్ * మాణిక్యవాచగర్ * నామదేవుడు * నర్మదా శంకర్ * నజీర్ అక్బరాబాది * పోతన * రాహుల్ సాంకృత్యాయిన్ * సరళాదాసు * తుకారామ్ * వీరేశలింగం * విద్యాపతి * పంజె మంగేశరావ్.

ఒక్కొక్క ప్రతి రూ 5/-

* భవభూతి * డా. సి. ఆర్. రెడ్డి * దత్తకవి * శ్రీ అరవిందులు * నమ్మాళ్వారు * మహర్షి దేవేంద్రనాథ్ టాగూర్

వివరాలకు వ్రాయండి :

**సాహిత్య అకాడెమీ (దక్షిణ ప్రాంతీయ కార్యాలయం)**

**29 ఎల్డామ్స్‌రోడ్, మద్రాసు-600018 దూరవాణి-454080**

**సాహిత్య అకాడెమీ, క్రొత్తఢిల్లీ,**
**బొంబాయి-కలకత్తా-మద్రాసు.**

### దక్షిణ భారత హిందీ ప్రచార సభ స్వర్ణజయంతి సందర్భంలో

# భారతీయ భాషల్లో కంప్యూటర్లు

— వేమూరి ఆంజనేయ శర్మ

ఇది కంప్యూటర్ యుగం. కొద్ది సంవత్సరాలలోనే ప్రారంభంకానున్న కొత్త శతాబ్దంలో కంప్యూటర్ ప్రయోగం ఎక్కువై వివిధ రంగాలలో విప్లవాత్మకమైన మార్పులు రావడం తథ్యంగా కనబడుతున్నది. దానికి కారణాలు రెండు. ఒకటి కంప్యూటర్ సాధిస్తున్న తథ్యాత్మక వివరణ. సరియైన పద్ధతిలో ప్రోగ్రామింగ్ జరిగితే కంప్యూటర్ అతి వేగంగా వివిధ రంగాలలో మహత్తరమైన నిర్ణయాలు చేయగలదు. అది పనిచేయలేని రంగంలేదు. ప్రవేశించని క్షేత్రంలేదు. మానవ మస్తిష్కంలాగానే అనేకమైన ఘటనల్ని, నిర్ణయాలను అది మెమోరీ సహాయంతో ఎంతో కాలం వరకు నిలవజేయగలుగుతున్నది. ప్రోగ్రామింగ్ సరిగ్గా లేకపోయినా, డెటా వివరం సరియైన పద్ధతిలో దానికి అందజేయకపోయినా తప్పులు జరుగవచ్చును. అది మానవ శక్తికి అతీతంగాదు. అది యంత్రం. అది మానవ ప్రయత్నానికి లోబడి ఉంటుంది. మానవ శక్తిని ఉపేక్షించదు. దాదాపు రెండు వందల సంవత్సరాల నుండి యీ రంగంలో జరిగిన కృషి ఫలితంగా ఇప్పుడది మానవుని నిత్యజీవితంలోనికి ప్రవేశించిందనవచ్చును. ఇది ఒక ప్రముఖ సాధనంగా రూపొందనున్నది. ఇది సత్యం.

విదేశాలలో కంప్యూటర్ రంగంలో విశేష కృషి జరిగింది. అందువలన ఆ రంగంలో ఇంగ్లీషు భాషకు ప్రాముఖ్యం ఏర్పడింది. మొదటి ప్రయత్నమంతా ఆ భాషా మాధ్యమంలోనే జరగడం అందరికీ తెలిసిన విషయమే. కంప్యూటర్ భాషలు వేరుగా ఉన్నవి. అవి బేసిక్, కోబాల్, పాస్కల్ వంటివి. కంప్యూటర్లకు ఆ భాషలే అర్థం కాగలవు. కంప్యూటర్ భారత దేశంలో ఇంగ్లీషు మాధ్యమంలోనే ప్రవేశించింది. అదే రూపంలో అది వ్యాప్తి జెందుతున్నది. ఇదీ పరిస్థితి. అయితే భారతదేశంలో యీ పరిస్థితి కొనసాగవలసిందేనా, లేక భారతీయ భాషల్లో కంప్యూటరుకు స్థానం కల్పించబడవలెనా ? అనే విషయాన్ని గురించి మనం ఆలోచించవలసి ఉన్నది.

భారత ప్రభుత్వం కంప్యూటర్ వ్యాప్తికి ఒక మంత్రిత్వ శాఖను ఏర్పాటుచేసి ఉన్నది. ఎలక్ట్రానిక్ కమిషన్ అందుకు కృషి చేస్తున్నది. రకరకాల కార్యక్రమాలను అది అమలు చేస్తున్నది. కంప్యూటరును విద్యార్థులలో వ్యాప్తం చేయడానికి మానవ వనరుల అభివృద్ధి శాఖ పాఠశాలల్లో కంప్యూటర్ శిక్షణకు ఏర్పాటు చేసింది. మొత్తం రెండు వేల పాఠశాలల్లో కంప్యూటరును ప్రవేశపెట్టవలెనని నిర్ణయించి మొదటి సంవత్సరం రెండు వందల ఏభై స్కూళ్లల్లో ప్రవేశపెట్టింది. ఆ యా స్కూళ్ళకు బి.బి.సి. మైక్రో కంప్యూటర్లు సరఫరాచేసింది, కొంత సాఫ్ట్‌వేరును గూడా అందించింది. ఉపాధ్యాయుల కొరత ఉండడం వల్ల కొన్ని కేంద్రాలను 'రిసోర్సు సెంటర్లు'గా గుర్తించి రెండు-మూడు వారాల శిక్షణ నిప్పించింది. అయితే ఇదంతా ఇంగ్లీషులోనే జరిగింది.

జరుగుతున్నది. దీనివలన ఇంగ్లీషు వ్యాప్తికి ఇంకొక వైజ్ఞానిక సాధనాన్ని కల్పించినట్లే అయింది. కానీ ప్రాంతీయ భాషల ద్వారా విద్య నేర్చుకొంటున్న విద్యార్థులకు దానివలన ప్రయోజనం కలగడంలేదు. తెలుగు మీడియం స్కూలులో ఇంగ్లీషు కంప్యూటరు ద్వారా ఫిజిక్సు, కెమిస్ట్రి వంటి విషయాలను నేర్పిస్తే ప్రయోజనం ఏముంటుంది? విద్యార్థులకు విషయం సరిగా బోధపడదు. హిందీ మాధ్యమంగా గల పాఠశాలల స్థితిగూడా ఇంతే. తెలుగు ద్వారా కంప్యూటరును అమలులోకితెస్తే తెలుగు పిల్లలకు ఉపయోగకరంగా ఉంటుంది. కనుక కంప్యూటరును భారతీయ భాషల్లోకి తీసుకొనిరావడం ఎంతైనా అవసరం. ఈ స్థితిలో దక్షిణ భారత హిందీ ప్రచార సభ యీ రంగంలోనికి ప్రవేశించింది. 1964లో యీ సభకు పార్లమెంటు ద్వారా జాతీయ ప్రతిపత్తి కల్పించబడింది. అందుకొరకై ప్రత్యేకించి ఒక అక్టు అంగీకరింపబడింది. ఆ అక్టు ప్రకారం సభకు యు. జి సి. అధినియమంలోని డిగ్రీలు ఇచ్చే అధికారం లభించింది. యం. ఏ., యం.ఫిల్., పి హెచ్. డి. వంటి డిగ్రీలు ఇచ్చే అధికారం లభించింది. స్వర్గీయ శ్రీ లాల్ బహదూర్ శాస్త్రిగారు 1964లో మద్రాసులో పోస్టు గ్రాడ్యుయేటు సెంటర్ ప్రారంభించారు. 1975లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారి సహకారంతో హైదరాబాదులో పోస్టు గ్రాడ్యుయేట్ సెంటర్ ప్రారంభించబడింది రిజిస్ట్రారు కార్యాలయం కూడా తాత్కాలికంగా మద్రాసు నుండి హైదరాబాదుకు తరలించబడింది. సభ సిండికేట్ మద్రాసు, హైదరాబాదు రెండు కేంద్రాలలో భారతీయ భాషల ద్వారా కంప్యూటర్ శిక్షణ కేంద్రాలు నడిపించవలెనని నిర్ణయించింది. హైదరాబాదు, ఢిల్లీపట్టణాలలో కంప్యూటర్ విశేషజ్ఞుల సమావేశాలు ఏర్పరచి వారి సహాయాన్ని సభ అర్థించింది. అయితే ఆవిశేషజ్ఞులు భారతీయ భాషల్లో కంప్యూటర్లు నడిపించడం సంభవం కాదని మమ్మల్ని చాలా నిరుత్సాహపరచారు. అయినా శ్రీ పి. వి. నరసింహారావు గారి ప్రోత్సాహంతో సభ నిరాశ పడక హిందీ మాధ్యమంలో హైదరాబాదు మద్రాసు కేంద్రాలలో కంప్యూటరు శిక్షణ తరగతులు ప్రారంభించింది. హిందీ ద్వారా డిప్లమా పరీక్ష కార్యక్రమాన్ని రూపొందించింది. మన దేశంలో భారతీయ భాషల్లో కంప్యూటరు నిర్మాణానికి జరిగిన కృషిని పరామర్శించడం ఇక్కడ అవసరం.

మొదట డి. సి. యం. కంపెనీవారు ద్వైభాషిక వర్డ్ ప్రొసెసర్ (హిందీ-ఇంగ్లీషును) తయారుచేశారు. వర్డ్ ప్రొసెసర్‌ను శబ్దసంసాధన యంత్రమంటారు. అయితే అది అంత సంతృప్తికరంగా కనిపించలేదు. ఆ తరువాత సి.యం. సి. కంప్యూటర్ మెయింటెనెన్స్ కార్పొరేషన్ సికింద్రాబాదు పక్షాన శ్రీ నరసింహంగారు లిపి అనే పేరుతో మూడుభాషల వర్డ్ ప్రొసెసరును తయారుచేశారు. అది మార్కెట్‌లోకి వచ్చింది. హిందీ, ఇంగ్లీషు, తెలుగు, తమిళం భాషలు అందులో పొందుపరచబడ్డవి. ముత్యాలవంటి అక్షరాలతో 'లిపి' ప్రచారంలోకి వచ్చింది. దానిలోని ప్రత్యేకత ఏమిటంటే దేవనాగరిలో టైపుచేసి తెలుగు కంట్రోలు గుర్తును ఒత్తితే దేవనాగరిలో టైపు అయిన అక్షరాలన్నీ తిరిగి టైపు చేయకుండానే తెలుగులోకి రాగలవు.

దక్షిణ భారత హిందీ ప్రచారసభ 'లిపి' సహాయంతో తరగతులు ప్రారంభించింది. ఈ లోపల భారత ప్రభుత్వం స్కూలు కార్యక్రమం క్రింద రెండు బి బి.సి. మైక్రో కంప్యూటర్లను సభకు అందజేసింది. బి.బి.సి కంప్యూటర్లు ఇంగ్లీషులో మాత్రమే పనిచేస్తూ ఉన్నవి. వాటి వలన మా ప్రయత్నానికి అంతగా సహకారం లభించలేదు. మేమెంత ఉబలాటపడినా తెలుగు-హిందీల వంటివి ఆ కంప్యూటర్లలోకి ప్రవేశించలేదు. ఇంతలో సి. యం. సి. కి చెందిన డాక్టర్ నరేష్‌కుమారరెడ్డి గారు హిందీలో 'రోమ్' తయారు చేశారు. దాన్ని మాకు అందజేశారు. ఆ రోమ్ సహాయంతో బి బి సి. కంప్యూటర్లు హిందీలో పనిచేయడం

ప్రారంభించాయి. అనగా బి. బి. సి. మైక్రో కంప్యూటర్లు ద్వైభాషికంగా పని ప్రారంభించాయి. హిందీ ఇంగ్లీషు రెండు భాషల్లో కంప్యూటర్ పని చేయడం ఆరంభించింది. ఆతరువాత కొద్ది రోజుల్లోనే నరేష రెడ్డిగారు తెలుగులో గూడా ఒక 'రోమ్' తయారు చేశారు. మొదట్లో తెలుగుకు రెండు రోమ్‌లు కావలసివచ్చినది. ఆ తరువాత తెలుగు అక్షరాలన్నీ ఒకే రోమ్‌లోకి కుదింపబడ్డాయి. ఆ రోమ్ సహాయం వలన బి.బి.సి. కంప్యూటరులో తెలుగు గూడా ప్రవేసించింది. దానితో మా కేంద్రంలోని బి.బి.సి. కంపూటర్లు మూడు భాషల్లో పని చేయడం ఆరంభించాయి. నరేష్‌రెడ్డి గారు చేసిన కృషి తెలుగు వారికి ఎంతో ఆనందదాయకమైనది.

భారతీయ భాషల్లో కంప్యూటర్లు రావు అనే మాట విని విని విసుగుచెందిన మాకు బి.బి.సి. కంప్యూటరు తెలుగులో పనిజేయడం ఆరంభించగానే ఏదో ఇంద్రజాలం జరిగినట్లనిపించింది. తెలుగును కంప్యూటరులో చూడగానే నాకు మహదానందం కలిగింది. మాతృభాషను జనం ఎంతగా ప్రేమిస్తారో ఆనాటి అనుభవం నాకు బోధ చేసినట్లనిపించింది. దానితో మా డిప్లమా కార్యక్రమానిక బలం చేకూరింది. మా డిప్లమా ప్రశ్న పత్రాలను మాకంప్యూటర్లే తయారుచేస్తున్నవి అచ్చువేస్తున్నవి. అచ్చుకు డాట్ మెట్రిక్ ప్రింటర్లను ఉపయోగిస్తున్నాము, పి.సి.సి.కి లిపికి వేరుగా బి. బి. సి. కంప్యూటర్లకు వేరుగా ప్రింటర్లు పనిచేస్తున్నవి సారాంశరూపంలో తేలినదేమిటంటే కంప్యూటర్లు భారతీయభాషల్లోతప్పక పనిచేయగలవు అనినిస్సంశయంగా తేలిపోయింది. ఇది జరుగుతూ ఉండగానే కాన్పూర్ ఐ.ఐ.టి. వారు శ్రీ మోహన్ తాంబే మరియు తదితర ఇంజనీర్ల సహాయంతో భారతీయ భాషల్లో బహు భాషా(మల్టీ లింగ్వల్) టెర్మినల్స్‌ను తయారుచేశారు. ఒకే కీబోర్డు సహాయంతో ఆ టెర్మినల్ యంత్రాలు ఆరు భాషల్లో పని చేయగలుగుతున్నవి. వెంటనే ఎలక్ట్రానిక్ కమీషన్ వారి సహాయంతో మద్రాసులో ఐదు టెర్మినల్స్‌ను, హైదరాబాదులో ఐదు టెర్మినల్స్‌ను సభ సంతరించుకున్నది. హైదరాబాదులో హిందీ,తెలుగు, ఇంగ్లీషు, మద్రాసులో హిందీ తమిళం ఇంగ్లీషు భాషల్లో టెర్మినల్స్ పని జేస్తున్నవి. ఆ టెర్మినల్స్‌ను ప్రధాన కంప్యూటర్ 32 బిట్ వైరస్ కంప్యూటరుతో జోడించి అన్ని భాషలలోనూ మా కేంద్రాలు పని జేయగలుగుతున్నవి. విద్యార్థుల సంఖ్యను పెంచగలిగాము. ఇప్పుడు మా కంప్యూటర్లు త్రిభాషాసూత్రం ప్రకారం పని జేస్తున్నవి. దీనితో భారతీయ భాషల్లో కంప్యూటర్లు పనిచేయలేవనే భ్రమ దూరమైంది. అదే సందర్భంలో సభ కేంద్రాలు మద్రాసులో 8, హైదరాబాదులో 8 పరసనల్ కంప్యూటర్లను సాధించగలిగినవి. వాటిని పి. సి. లంటారు. పి. సి. లలో ఒక్క ఇంగ్లీషు మాత్రమే ఉపయోగంలో ఉన్నది. అవి ఇంగ్లీషులో తప్ప ఇతర భాషలలో పని జేయడంలేదు. కానీ తాతా కన్సల్టెన్సీ వారు 'శబ్దమాల' అనే పేరుతో హిందీకి సంబంధించి ఒక ఫ్లాపీని తయారుచేశారు. ఆ ఫ్లాపీలను పి.సి.లలో అమర్చి వాటి సహాయంతో పి. సి. లు ద్వైభాషికంగా పని చేసే అవకాశం ఏర్పరచబడింది. ఇప్పుడు మా పి. సి. లన్నీ శబ్దమాల సహాయంతో హిందీ ఇంగ్లీషు రెండు భాషల్లో పని జేస్తున్నవి. అయితే యీ శబ్దమాల ఫ్లాపీలు వర్డ్ ప్రొసెసింగ్‌కు ఉపయోగపడుతున్నవి. వాటి ద్వారా ప్రొగ్రామింగ్ చేసే అవకాశం లేదు.

ఏమైనా పి. సి. లు గూడా రెండు భాషలలో పని చేస్తున్నవి. పదిహేను రోజుల క్రితం ఢిల్లీలో కంపెనీ వారు తయారు చేసిన మల్టీ లింగ్వల్ కార్డు ఒకటి దృష్టికి వచ్చింది. ఆ కార్డు సహాయంతో పి. సి. లు ఒకే కీ-బోర్డు సహాయంతో ఎనిమిది భాషలలో పని జేయగలవు. అంతేగాక యీ కార్డు సహాయంతో ఎనిమిది భాషల్లో వర్డింగ్, ప్రొసెసింగ్ మాత్రమే గాక

ప్రోగ్రామింగ్ సౌకర్యం గూడా పొందగలిగాము. ఇంతవరకు భారతీయ భాషా రంగంలో కంప్యూటర్లు రూపొందిన విధానంలో ఇది ఒక విప్లవాత్మకమైన మార్పు. ఆ కార్డును మా పి సి. లకు ఉపయోగిస్తు న్నాము. మా పి సి లు మల్టీ లింగ్వల్ పి సి లుగా పని జేస్తున్నవి. అంటే కాన్పూరు టెర్మినల్స్‌ను కూడా ఈ కార్డు వెనుకకు నెట్టుతున్నది డి. సి యం. వారి ద్విభాషిక వర్డ్ ప్రొసెసర్ల రూపంలో ప్రారంభమై, సి. యం. సి. వారి లిపిగా మారి బి. బి. సి. మైక్రో కంప్యూటర్లకు కూడా ఎక్కి ఆ తరువాత కాన్పూరు వారి మల్టీ లింగ్విల్ టెర్మినల్ రూపాన్ని ధరించి, పి. సి. లలో సైతం ముందు ద్విభాషిక రూపంలోనూ ట్రిన్స్క్రిట్ కార్డుతో బహుభాషికంగానూ యాత్ర సాగి కంప్యూటర్లు భారతీయ భాషల్లో పని జేస్తున్నవి. భారతీయ భాషల్లో కంప్యూటర్ల వికాసానికి సంబం ధించిన స్థితి ఇది.

దక్షిణ భారత హిందీ ప్రచారసభ యీ వికాస యాత్రలో పయనించి హిందీ మరియు తదితర భార తీయ భాషల వికాసానికి కృషి చేస్తున్నది. తేలిందేమి టంటే హార్డ్‌వేర్‌కు సంబంధించినంతవరకు కంప్యూ టర్లు భారతీయ భాషల్లో పనిచేయగలవనేది నిర్వివాదాం శం. విజ్ఞానం అభివృద్ధి చెందిన కొద్దీ కంప్యూటర్లు ఇంకా వికాసాన్ని పొందగలవు. ఇక ఇప్పుడు సభ ముందున్న పెద్దసమస్య సాఫ్ట్‌వేరుకు సంబంధించి ఉన్నది. సాఫ్ట్‌వేర్ గూడా కంప్యూటర్లకు పనికివచ్చే విధంగా భారతీయ భాషల్లో వికాసం పొందడం అవస రం. ఒక్క హార్డ్‌వేరుతో పని సాగదు. ఎలక్ట్రానిక్ కమిషన్ వారు సాఫ్ట్‌వేరు తయారు జేయడానికి ఒక ప్రాజెక్టును సభకు మంజూరు చేశారు. ఆ ప్రాజెక్టును దక్షిణ భారత హిందీ ప్రచారసభ,మద్రాసు ఐ.ఐ టి. రెండూ కలసి (కొలాబరేషన్) పద్ధతిలో అమలు పర చగలవు. వాటిని కార్డ్‌కాల్ కార్యక్రమాలంటారు. ఆ రెండు సంస్థలూ కలసి సాఫ్ట్‌వేరును ముందు హిందీ లోనూ తరువాత తదితర భారతీయ భాషల్లోనూ తయారు చేయడానికి ప్రయత్నం ప్రారంభించినవి ఏడు నెలల లోపల విజయం సాధించగలమని విశ్వసి స్తున్నవి.

ఇది మా సంస్థ అనుభవము. భారతీయ భాషల్లో కంప్యూటర్ విజ్ఞానం పెరగాలి. అన్ని రంగాలలోనూ భారతీయ భాషల్లో కంప్యూటర్ ప్రవేశించాలి. అనాడే అది జన సామాన్యానికి హితం సమకూర్చగలదు.

రిజిస్ట్రార్ ఉచ్చశిక్షా ఔర్ శోధ్‌సంస్థాన్
దక్షిణ భారత హిందీ ప్రచారసభ
హైదరాబాదు-500 004

# భాగవతాంధ్రీకరణలో పోతనగారనుసరించిన అనువాద పద్ధతి

యం. కనకాచారి

నిగమకల్పతరుగళితమైన ఫలం భాగవతం సంస్కృతంలోని వ్యాస భాగవతాన్ని ఆంధ్రీకరించడం ధైర్యసాహసాలతో గూడిన గొప్ప ప్రయోగం అట్టి ప్రక్రియకు పూనుకున్న ధీశాలి బమ్మెర పోతనామాత్యుడు. అతడు సహజ పాండిత్యం గలవాడు.

అయితే వేలకొలది శ్లోకములతో గూడిన సంస్కృత భాగవతాన్ని తెలుగులోకి అనువదించే కార్యక్రమంలో భాగంగా పోతన ఒక అనువాదపద్ధతిని రూపొందించుకొన్నాడు. అతడు చేపట్టిన అనువాదపద్ధతిని పరిశీలించే ముందు అనువాద పద్ధతులను పరిశీలించటం సముచితము.

పోతనకు ముందున్న అనువాద పద్ధతులను రెండు రకాలుగా విభజించవచ్చును.

1. స్వేచ్ఛానువాదం :- కథా స్వరూపం చెడకుండా మూలాన్ని సంక్షేపిస్తూ, విశ్లేషిస్తూ చేసే అనువాదం. ఉదా :- కవిత్రయము వారిది.

2. యధామూలానువాదం :- అందమైన వర్ణనలు సుందర శబ్దజాలము వదిలిపెట్టకుండాచేసే అనువాదం. ఉదా :- శ్రీనాథాదుల కావ్యములు.

అయితే పోతనగారు పైరెండు మార్గాలకు మధ్యే మార్గంగావుండే అనువాదం సాగించాడు. నన్నయను తిక్కనను, భాస్కరున్ని, నాచన సోమున్ని అనుసరించిన మాట నిజమే కాని నన్నయాదుల అనువాద పద్ధతి సంగ్రహాత్మకమైనది. వారి అనువాదములో మూలగ్రంథ పరిమాణము సగానికితగ్గినది. సోముడు 4,5 కథలను తీసుకొని మిగతా కథలన్నింటిని వదిలి వేసినాడు పోతనపై రెండు పద్ధతులను అనుసరించక పోగా ఆయన అనువాదమున మూలగ్రంథ పరిమాణము రెట్టింపయినది. అసలే భాగవతము మహాపురాణము. ప్రౌఢమైనటువంటిది. పైగా మోక్ష శాస్త్రము-వేదాంతోపన్యాసాలతో కూడినట్టిది ఇందులోని ఉపాఖ్యానాలు హృదయాన్ని పులకరింపజేస్తాయి.

అట్టి మహాగ్రంథాన్ని వివరణాత్మకంగా అనువదించుటలో పోతనగారి దృఢ సంకల్పము, కఠోర పరిశ్రమ అర్థమౌతుంది. అతడు అనువదించుటకు ముందు ఒక పద్యాన్ని వ్రాశాడు.

భాగవతము దెలిసిపలుకుట చిత్రంబు
శూలికైన దమ్మి చూలికైన
విబుధవరుల వలన విన్నంత కన్నంత
తెలియవచ్చినంత తేటపఱతు

దీని తాత్పర్యమేమిటంటే

1. విన్నంత అనగా :- భాగవతమును వ్యాఖ్యానించు పెద్దలు శాస్త్రజ్ఞానంతో మధించి పలికిన పలుకులు వినుట వలన కలిగిన జ్ఞానంతోను.

2. కన్నంత అనగా :- శ్రీధరాది వ్యాఖ్యానాలు చదువుటవలన కలిగిన అనుభూతులతోను

3. తెలియ వచ్చినంత అనగా :- తాను భాగవతాన్ని పఠించుటవలన తనకు తెలిసినంతవరకు

4. తేటపరతు అనగా :- భాగవత గ్రంథులను విప్పవలసినచోట విప్పి విస్తృతంగా, వివరణాత్మకంగా సరళమైన భాషలో స్పష్టీకరించడం

భాగవత వ్యాఖ్యాతృ శిరోమణియగు శ్రీధరుడుకూడా "ఈక్షంతామిచ్ఛయా సంతః క్షమంతాంమమసాహసమ్ మయాపిస్వీయబోధాయ కృతమేతన్నగర్వతః"

ఆ గ్రంథ గౌరవమట్టిది. దానిని సమీపించిన వారందఱు వినయంతోనే ప్రవర్తించిరి.

**పోతనగారు పాటించిన ప్రణాళికాస్వరూపం:**

1. మూలములోనిసత్వార్థములను తేటతెల్లము చేయుట.

2. మూలమును మక్కికి మక్కిగా అనువదించకుండుట.

3. విషయ వివరణము చేయుట.

4. వ్యాఖ్యా గత విశేషములను సాధ్యమైనంత వరకు సంయోజించుట.

5. కథలయొక్క, భావముల యొక్క సౌందర్యమును దీపింపజేయుట.

6. రచనలోని దివ్యమైన అనుభూతినికనబరుచుట

దీనిని బట్టి చూచినచో, మూలమును పోతనగారు ఎంత శ్రద్ధతో, ఎంతనిష్ఠతో అధ్యయనము చేసినారో స్పష్టమగుచున్నది. పై ప్రణాళికను దృష్టియందుంచు కొనుటవలననే వారి గ్రంథము రెట్టింపయినది.

ఇక పోతే వారు వాడిన భాష ఎటువంటి దనగా:-

నన్నెచోడుడు తెలుగు లోకోక్తులకు ప్రాణం పోశాడు. నన్నయ్య శైలి సంస్కృత భూయిష్ఠమైనది. అయినా సరళమైనదే. శివకవులు జాను తెనుగుకు, దేశీయ ఛందస్సుకు పట్టం కట్టారు. తిక్కనాదులు తెలుగు నుడికారానికి ప్రాధాన్యమిచ్చారు. శ్రీనాధుడు సంస్కృతాన్ని గుభాళింపజేసినాడు. ఇక మరి పోతనగారి కాలానికి ప్రజలు తెలుగు సంస్కృతములను ఒకే రకంగా ఆదరించే స్థితిలో వున్నారు.

నన్నయ్యగారు, రచనా ప్రౌఢిమకు, తిక్కనగారు కథా సంవిధానానికి ఒరవడిపెట్టగా పోతనగారు ఆ యిరివురి మార్గాలకు మెరుగులుదిద్దారని చెప్పవచ్చును. అయితే వారి పద్యం వలన వారు చేపట్టిన భాష మేమిటో తెలుస్తుంది.

"కొందఱికి దెనుగు గుణమగు
కొందఱికి సంస్కృతంబు గుణమగు రెండున్
కొందఱికి గుణములగు నే
నందఱ మెప్పింతుగృతులనయ్యె యెడలన్"

పోతన గారు :—

1 కొన్ని కథాభాగాలలో స్వతంత్రానువాదం చేశాడు.

2. కొన్ని కీలకస్థానాలలో, ప్రతిశ్లోకానువాదం చేశాడు.

3. కొన్ని చోట్ల మూల శ్లోకాలకు సానబట్టాడు.

4. కొన్నిచోట్ల అర్థవివరణకై వాఖ్యానాన్ని ఆశ్రయించాడు.

5. కొన్నిచోట్ల స్వకపోలకల్పనలు చేశాడు.

ఈ విధముగా మార్పులు, కూర్పులు, జరుగుట వలననే 12 స్కంధాలతో, 322 అధ్యాయాలతో, 18000 శ్లోకాలతో వున్న మూలము అనువాదమున 32000ల శ్లోకాలకు పెరిగినది.

**పెరుగుదలకు కారణములు :-**

1. అష్టాదశపురాణములలోని భాగవత తత్త్వ రహస్యాన్ని, భగవద్భక్తినీ విపులంగా వర్ణించడం.

2. మూలగ్రంథమునేకాక, వాఖ్యానాలను చూసి కూడా వాటిలోని విశేషాలను వివరించడం.

3. భగవంతుని గుణగణములను, రూపవైభవాలను వర్ణించుటపట్ల భక్త్యావేశములతో రచించడం.

4. మూలములోని కృష్ణ కథలనేకాక, హరివంశము, విష్ణుపురాణము మొదలైన గ్రంథాలలోని కృష్ణకథలను చేర్చడం.

5. రాసక్రీడ, జలక్రీడ, ఋతువర్ణన, సూర్యచంద్రోదయాదులను ప్రత్యేకంగా రచించడం.

**ఉదాహరణకు**

| క్రమసంఖ్య | స్కంధము | కథ | శ్లోకములు మూలమున | అనువాదమున |
|---|---|---|---|---|
| 1. | తృతీయ | విదుర మైత్రేయ | 50 | 208 |
| 2. | సప్తమ | ప్రహ్లాద చరిత్ర | 350 | 1000 |
| 3. | అష్టమ | గజేంద్రమోక్షము | 120 | 500 |
| 4. | — | క్షీరసాగర మధనము | 350 | 700 |
| 5. | — | వామన చరిత్ర | 200 | 700 |
| 6. | దశమ | — | — | 3,4 రెట్లు |
| 7. | — | రుక్మిణీకల్యాణము | 200 | 500 |
| 8. | — | గోపికా గీతాలు | 40 | 80 |

**పోతనగారి అనువాద శిల్పము :-** మూలభావములను ప్రసన్నము చేయుటకై ఆయన చూపిన శిల్ప ప్రతిభ అనన్య సామాన్యము. ఆయన చేతిలో అనువాదమొక శిల్పముగా పరిణమించినది. మూలభావమును తనకన్నుల యెదుట నిల్పుకొని దానిని పరిశీలించి, దాని రామణీయకమును చక్కగా భావించి, అనుభవించి దానికి ఉచితరీతిని సంస్కారములు చేసి తత్సంబంధ సౌందర్యమును దీపింపజేయుటకై వారు ప్రయత్నించిరి.

**అందుకు వారనుసరించిన పద్ధతులు :-**

1. వాచ్యమైన భావమును వ్యంగ్యము చేయుట. కృష్ణవిచయమున భూమిని గురించి గోపికావచనములు

మూలం : కింతేకృతంసఖితపాహోబతకేశవాంఘ్రికటి
స్పర్శోత్సవోత్పులకితాంగరుహైర్విభాసి

పోతన :- కటియై కౌగిట చేర్చెను
వటుడై వ్రేల్మి కొలిచెవడి గష్టుండై
యిట పదచిహ్నము లిడెగ్రిం
దటిబామున నేమి నోచితమ్మ? ధరిత్రీ!

ఈవిధంగా మూలమున స్పర్శోత్సవము, తజ్జనోత్పులకలకు తత్త్వలు వాచ్యములైనవి,

పోతనగారు వానిని వ్యంగము కావించి భాగవత సౌందర్యమును ప్రసన్నము చేసినారు.

(2) విశేషణమును మార్చుట :—

మూలము :- అటతి యద్భవానహ్ని కాననం
.........................
జడ ఉదీక్షతాం పక్ష్మకృద్దృశామ్

పోతన :- నీవడవింబవల్ దిరుగ నీకుటిలాలక
.........................
.........................
లక్ష్మవర రెప్పలడ్డముగజేసెనిదేల విధాత క్రూరుడై.

ఈ విధంగా మూలమునందలి విధాతృ శబ్ద విశేషణంబగు జడ శబ్దమును తొలగించి అచట క్రూర శబ్దమును వాడి భావమునకు దీప్తి తెచ్చినాడు పోతన.

(3) విశేషాధానము వలన భావదీప్తి :

మూలం:- దృష్టోవః.........పున్నాగచంపకాః

పోతన :- పున్నాగ కానవే పున్నాగవందితు
తిలకంబ కానవే తిలకనిటలు
ఘనసారకానవే ఘనసారశోభితు
బంధూక కానవే బంధుమిత్రు

(4) రేఖా మాత్రభావనకు రూపకల్పన :—

మూలం:గామానుజో మానినీనాంగతోదర్పహరస్మితః
మాలత్యదర్శినః కచ్చిన్మల్లికే జాతియాధికే

పోతన : నల్లనివాడు పద్మనయనంబుల వాఁడు కృపా రసంబుపై
జల్లెడువాడు మౌళి పరిసర్పితపింఛమువాడు నవ్వులా
జిల్లెడుమోము వాడొకడు చెల్వల మానధనం బు దెచ్చెనో
మల్లియలార మీపొదలమాటున లేడు గదమ్మ చెప్పరే

ఈ విధంగా వ్యంజనావృత్తి చేత ప్రపాదించు పారిజాత తరు ప్రసూనము వంటి పద్యముల నెన్నింటినో పొందుపరిచినాడు. ఇట్లు భాగవతానువాదము పరమ రమణీయముగా నిర్వహించి భావ సంయోజన శిల్పదక్షతను చూపిన మహనీయుడు పోతనగారు.

ఇకపోతే పోతనగారు అనువదింపక వదిలివేసినవి ఏమిటంటే

1. కుంతస్తుల శ్లోకము.

2. కీర్తన శ్రవణముల వల్ల కైవల్యము కల్గునని చెప్పుశ్లోకం.

3. గజేంద్ర మోక్షములో జీవుని వేదనను వ్యక్తం చేయుట.

4. అదితి కశ్యప సంవాదములో పయోభక్షణ వ్రతమును గురించి కశ్యపుడు అదితికి విపులీకరించిన శ్లోకం.

**పోతనగారు స్వయంగా పెంచిన భాగములు:**

రసపారవశ్యము చేతను, వర్ణనా ప్రియత్వము చేతను మూల కథకు పలుతావులందు అనువాదమును పెంచివ్రాసెను. 7వ స్కంధములోని ప్రహ్లాద చరిత్ర మున సుమరు 20 పద్యాలు గలవు. ఉదాహరణగా మచ్చుకు కొన్ని..................

1. తనుహృద్భాషణల సఖ్యమగు ......

2. కమలాక్షు నర్చించు కరములు కరములు.

3. సంసార జీమూత సంఘంబు విచ్చునే మొద లగునవి.

8వ స్కంధమున పెంచి వ్రాసిన భాగములు: సుమారు 70 పద్యాలు గలవు.

ఉదా :- 1. ఖిల్లా శల్లలులాయక
2. లావొక్కింతయులేదు
3. అలవైకుంఠపురంబులో
4. సిరికింజెప్పడు
5. అడిగెదనని కడువడిజని మొదలగునవి.

ఇట్లే వామనావతార ఘట్టమున పెక్కు భాగము లను పెంచివ్రాసెను. బలిచక్రవర్తి, స్వర్గముపై దాడివెడలిన సందర్భమున ఒక పెద్ద వచనముగలదు అది పోతన గారి భావనాపటిమకు తార్కాణము. ఉదాహరణకు అదితి గర్భవర్ణనమున గల 7 పద్యములును స్వతంత్రములైనటు వంటివి. పైగా అవి

సందర్భోచితములే గాక కడు రమణీయములు కూడాను. వామనావతార ఘట్టములోని

1. చండస్ఫూర్తి పటుండుగాంచె
2. ఇంతింతై వటుడింతయై

వంటి పద్యములు అమూలకములయ్యెను, పర మోచితములై పోతనగారి మహాప్రతిభా లక్షణములను విశదీకరించుచున్నవి.

గోపికలు శ్రీకృష్ణుని వెదకు సందర్భమున దివ్యా వేశముతో పోతన వ్రాసిన

1. పున్నాగ కానవే పున్నాగ వందితు
2. నల్లని వాడు పద్మనయనంబులవాడు

వంటివి సాహిత్య సర్వస్వమునకు మేలు బంతులు.

1. బలరామ కృష్ణక్రీడలు
2. చాణూర కృష్ణుల సంవాదము
3. గోపికా విరహము
4. రుక్మిణీకళ్యాణము పెంచివ్రాసినవి.

ఆదియును గాక పోతనగారు స్వతంత్రముగా వ్రాసినటువంటివి.—

1. రుక్మిణీ వర్ణనము
2. రుక్మిణీ విరహ వర్ణనము.

నరకాసుర సందర్భమున- సత్యభామ కృష్ణునితో యుద్ధమునకు వెళ్ళుట, నరకాసురునితో యుద్ధము చేయుటవంటివి అమూలకములే.

ఇవన్నియు పోతనగారి రసావేశ వైశద్యమునకు, వర్ణనాశక్తికి, పద్యరచనా కౌశల్యమునకు నికషోపల ములుగా నున్నవి.

పోతన శ్రీధరీయముననుసరించి వివరించిన యీ సాధారణాంశములను 4 విధములుగా విభజించ వచ్చును.

1. కథా పరామర్శలు
2. గూఢార్థ పదభావ వివరణము.
3. పదప్రయోగ స్వారస్య వివరణము
4. శబ్దార్థము.

ఆధ్యాత్మిక తత్త్వమును విశదముగా నిరూపించు టకు పోతనగారు మక్కిలి జాగరూకతతో శ్రీధరీ యము ననుసరించివారు. తత్త్వనిరూపణ విషయమున మిక్కిలి ప్రౌఢమైనట్టియు, నిగూఢార్థ పదబంధవిల సితమైనట్టియు శైలి గల్గియున్నది. వ్యాఖ్య సహాయము లేకుండా ఈ పటుత్వమును అర్థము చేసుకొనుట కష్టం మూలభావములకు వాఖ్యాగత విశేషములను జోడించు టలోనే యనువాదకుని ప్రతిభా ప్రభావముండును. ఈ పటుత్వ స్థలమందు పోతన పద్యములకంటె వచ నములనే ఎక్కువగా వాడినాడు. ఎందుకంటె పద్య ములను వాడితే వ్యాకరణ నియమాలు ఎక్కువ గనుక విషయ నిరూపణము స్పష్టముగా కుదరదు. గనుక వచనమునే వాడినాడు. చాలా తక్కువ పద్యా లను వాడినాడు. అందు సీస పద్యములే ఎక్కువ. ఇవేగాకుండా శ్రీధరీయానుసరములను గూడ చాలా చక్కగా అనువదించి వన్నెదెచ్చిన కీర్తిమంతుడు పోతనామాత్యుడు.

ఈ విధంగా కవిలోకానికి కవియై భువిలో వెల్గొందిన పోతనామాత్యుడు సంస్కృత భాగవతాన్ని తెనుగులో వివరణాత్మకంగా సరళమైన భాషలో సంపూర్ణంగా అనువాదం చేసి అందించిన పరమ పూజ్యుడు, తెలుగు సాహితీ క్షేత్రంలో చిరస్మణీ యంగా నిలిచిపోయిన భాగ్యవంతుడు.

సహాయ గ్రంథాలయాధికారి,
తెలుగు విశ్వవిద్యాలయం,
హైదరాబాదు-500 007.

# రా మ ప్ప

ఆంగ్ల మూలం : రాజాజీ                    తెలుగుసేత : కంకరగంటి రంగాచార్యులు

కుప్పన్నగౌడు చనిపోయే నాటికి అతని జ్యేష్ఠ పుత్రుడు సుబ్బన్నకు ముప్పై ఏళ్ళు. అతని ద్వితీయ పుత్రుడు రామప్పకు పదారేళ్ళు. అది మామూలు రైతు కుటుంబం. రెండెకరాల మెట్ట పొలంతో వాళ్ళు కనాకష్టంగా బ్రతికే వాళ్ళు.

సుబ్బన్నా రామప్పలు సవతి తల్లుల కుమారులు. మొదటి పెళ్ళాం చనిపోయిన తర్వాత నాలుగేళ్ళు కుప్పన్న మళ్ళీపెళ్ళి మాట ఆలోచించలేదు. ఆతర్వాత అతడు మళ్ళీపెళ్ళి చేసుకొన్నాడు. రామప్ప అతనిచిన్న పెళ్ళాం కొడుకు. అతడు వాణ్ణి చదువవేశాడు. అతని భార్య అతనితో ఇలా చెప్పింది. "ఈ నిస్సారమైన రెండెకరాల పొలంమీద ఎందరు బ్రదుకగలుగుతారు? నా కొడుకు బడికి వెళ్ళి చదవనీ; ఏదైనా ఉద్యోగాని కుపయోగపడే చదువు చదివి, వాడు సంపాదించుకొని బ్రతకనీ." అందుకు అతడు ఒప్పుకొన్నాడు.

అబ్బాయి బుద్ధిమంతుడు, వాడు పట్టుదలతో చదివేవాడు. వాడెనిమిదవ తరగతివరకూ ఎక్కి వచ్చాడు, తరగతిలో అన్ని విషయాల్లోనూ అగ్రతాంబూలం వానిదే. వాడంటే బడిలో ఉపాధ్యాయులందరికీ చాలా అభిమానం.

కుప్పన్న మరణానంతరం కూడా అబ్బాయి చదువు నిలిచిపోలేదు. చాలా కష్టపడుతున్నాగాని సుబ్బన్న సాయం చేశాడు. కుప్పన్న చనిపోయినాక ఒక సంవత్సరానికి రామప్ప తల్లికి మశూచి సోకి గతించింది.

క్రమంగా కుటుంబంలో చీలిక ఏర్పడింది. సుబ్బన్న మేనమామ సామియప్ప కుటుంబంలో అడుగు పెట్టాడు. సుబ్బన్న తల్లి తోబుట్టువు మాటి మాటికీ తన భార్యతో కూడా వచ్చి, ప్రతి సారి వచ్చినప్పుడంతా రెండు మూడు రోజులుండి వెళ్ళేవాడు. వాళ్ళపల్లె కాళిమప్పని పుదూరు అక్కడికి పదిమైళ్ళుండేది.

"సీవీలాగా నీ తమ్ముడి చదువుకోసం ఖర్చుచేశావంటే" అని సామియప్ప సుబ్బన్నను విమర్శిస్తూ, "నీకేం దక్కుతుందనుకున్నావు? మేమంతా ఏమైన చదివామా?" అన్నాడు. సుబ్బన్న ఈ మాటలను మొదట ఎక్కువగా పట్టించుకోలేదు. అయితే పట్టుదలతో కొట్టుతూవుంటే పాషాణంకూడా సమసిపోతుంది. సుబ్బన్న తన మేనమామ మాటలను పునరాలోచించాడు. అత్తపాపక్క సుబ్బన్న భార్యతో వాదించడానికి వకాల్తాపుచ్చుకొనింది. ఆమె ఈలా చెప్పింది, ముష్టి రెండెకరాలమీది రాబడి నీలా ఖర్చుచేస్తే, అబ్బాయి చదువు ముగిసేటప్పటికి కుటుంబం దట్ట దరిద్రస్థితికి దిగజారుతుంది. రామప్ప పరీక్షల్లో పాసయి ఉద్యోగాలుచేసి ఊళ్ళేలుతాడని మనకేం నమ్మకం? ఒకవేళ వాడికి ఉద్యోగం దొరికినా, వాడు మిమల్ని పోషిస్తాడా? అదెన్నటికీ జరగదు. అప్పటికి మీరు వీధుల్లోపడి బిచ్చమెత్తుకుంటూ వుంటారు." ఆమె నిదానంగా ఈ విషాన్ని తన వదినెలోకి సూదిమందులా ఎక్కించింది. ఆమె భయపడ్డది.

ఒకనాడు సామియప్ప ఈ విషయాన్ని సుదీర్ఘంగా చర్చించి, పరిస్థితులు విషమించుటకన్న ముందే ఆస్తిని

పంచడం మంచిదని హితబోధచేశాడు. "నీ తమ్మునికి వానిభాగమిచ్చి, నీవు నీభాగం తీసుకొని నిశ్చింతగా ఉండు." సుబ్బన్న అలాచేయడానికి నిర్ణయించుకున్నాడు.

అప్పటికి రామప్పకు పద్నెనిమిదేండ్లు. వాడు భవానిలో ఒక ఉన్నతపాఠశాలలో చదివేవాడు. "అన్నా" అంటూ వాడు సుబ్బన్నతో చెప్పాడు.' నీవు ఆస్తిని పంచాలని నిర్ణయించుకొనేవుంటే నామాట విను. మన ఇద్దరిమధ్య ఈ రెండెకరాలను పంచుకొంటే, మనం పొలం దున్ని ఎలా పండించుకోగలం? మన ఇద్దరిలో ఎవరికీ ఇది లాభదాయకం కాదు. ఆ రెండెకరాలూ నీవే ఉంచుకో నాకేమక్కరలేదు."

మేనమామ అన్నాడు, 'నీవు కోపంతో మాట్లాడుతున్నావురా' "లేదు మామా. అదికాదు. నాఉద్దేశం ఒకటే ఒకటి. మనతండ్రి మనకోసం ఇచ్చిపోయిన ఈ రెండెకరాల పొలాన్ని పంచుకొని పాడుకాకూడదని. నేనేదైన ఒకచిన్నపని చూచుకొంటాను. అన్నే ఇల్లూ, పొలమూ రెండూ ఉంచుకొని అనుకూలంగా ఉండనీ." ఆ తర్వాత రామప్ప భవానికి వెళ్ళిపోయాడు.

సుబ్బన్నభార్య తగాదా పైవిధంగా తీర్మానమైనందుకు మహదానందం చెందింది. కానీ సుబ్బన్న మనస్సు మాత్రం కళవళపడింది. అతడు తన తమ్ముని పట్ల తాను చాలా అన్యాయంగా ప్రవర్తించానని చాలా మథన పడ్డాడు.

"వాడే ఈ త్యాగం చేయడానికి తీర్మానించుకుంటే మనం వాని దారికడ్డంగా ఎందుకు నిలవాలి?"అన్నాడు మేనమామ సామియప్ప.

రామప్ప భవానిలో తహశీల్దారు ఆఫీసులో ఒక జవాను ఉద్యోగానికి కుదిరాడు.

వాడు చదువుకొన్న పిల్లవాడుకాన అడిగినంతనే ఉద్యోగం దొరికింది. అతని ఉపాధ్యాయుడు కన్నీళ్ళు పెడుతూ ఇలా అన్నాడు. "ఏమీ! నీవు జవానుగా కుదరడమా? చదువే ముగించివుంటే, తాశీల్దారుగా ఉండేవాడివి."

"బాధపడకండి, రామస్వామి అయ్యరుగారూ!నేను వాణ్ణి పైకి తెస్తాను." అని తహశీల్దారు మసలిమణి మొదలియారు ఉపాధ్యాయుణ్ణి ఓదారుస్తూ అన్నాడు.

తాశీల్దారు రామప్పను తనజవానుగా వేసుకొన్నాడు. అతడు వాని పట్ల సానుభూతీ, దయా చూపేవాడు. అతడు రామప్పను తన ఇంటి వెనకాలి ఒక గుడిసెలో ఉండనిచ్చాడు. తహశీల్దారు ఇంట్లోనే వానికి భోజనం.

రామప్పకు రోజులీలాగా హాయిగా గడిచిపోతున్నాయి. సమస్త పిత్రార్జితాన్నీ అన్నకే ఇచ్చివేసినందుకు అతడు అపరిమితమైన తృప్తిని పొందాడు.

కుప్పు సుబ్బన్న కొడుకు. వానికైదేళ్ళు. వాడు పలుమార్లు భవానికి వస్తూండేవాడు. ప్రతిసారీ రెండు మూడు రోజులుండేవాడు. వానికి వాని పినతండ్రి, రామప్పంటే పరమప్రీతి. వాని తల్లికి మాత్రం అది సరిపోదు. కానీ సుబ్బన్న దీనిని అడ్డగించలేదు. సరికదా తానే తన కుమారుణ్ణి రామప్ప వద్దకు పిలుచుకొని పోయి, అక్కడే వదలి వచ్చేవాడు,

"నిజంగా నా కొడుకును మాయలుచేసి తనవైపు లాక్కున్నాడు. అంచేత వాడు పిన్నయ్యంటే బిరబిర వెంట పరుగెత్తుతాడు. ఈ రోజు కాకుంటే, రేపు తప్పకుండా వాడు నా కొడుకుకు విషంపెట్టి చంపేస్తాడు. మా సంసారాన్ని నాశనం చేస్తాడు." ఈలాగా సుబ్బన్న భార్య తన భయాలను ఊరినుండి వచ్చిన తన అత్తకు చెప్పింది.

"అదితప్పక జరుగుతుంది."అని అత్తమొదలుపెట్టి

"మనమీవిషయమై ఏం చెయ్యాలి? ఇది సుబ్బన్న కర్మ మేకాదు. అతడు తనలాగే అందరూ మంచివాళ్ళని అనుకుంటాడు." అని ముగించింది.

కుప్పు వెనకాల దొడ్డిలో ఆడుకొంటున్నాడు. వాడు ఉన్నదట్లే కెవ్వునకేకవేశాడు. "చిన్నాన్నా! చిన్నా న్నా! పాముకాటేసింది." కేక విని రామప్ప అక్క డికి పరుగెత్తుకుపోయాడు. అతడు పడగవిప్పిన త్రాచు పామును చూచాడు. అది బొరియలోనికి ప్రాకిపోయింది కుప్పు భయోద్రేకంతో క్రిందికి పడిపోయాడు. రామప్ప వాణ్ణి పైకిలేపాడు. పాముకాటేసిన చోటికి కొంచెంపైన రామప్ప బిర్రుగాకట్టుకట్టాడు. కాటునుండి బయటికి ప్రవహిస్తున్న నెత్తురును నోటితోపీల్చి, బయ టికి ఉమ్మివేశాడు. ఈ పద్ధతిని మునుపతనెక్కడో నేర్చుకొని ఉండినాడు.

వెంటనే తహశీల్దారు కుప్పును ఆస్పత్రికి పంపిం చాడు. పిల్లవాడికేమాత్రం అపాయమూ కలగలేదు. వాడు కోలుకొన్నాడు. కానీ రామప్ప రోగగ్రస్తు డయ్యాడు. అతని నోట్లో ఒకపుండు వుణ్ణిందనీ, దాని గుండా పామువిషం అతని రక్తంలోకి ప్రవేశించిందనీ డాక్టరు చెప్పాడు.

రామప్ప ఒకనెల బాధపడ్డాడు. రోగం నయం కాలేదు. సేలంలోని పెద్దాసుపత్రికి పిలుచుకొని పోయారు రామప్పను.

"నేను చెప్పలేదా? నేను నమ్మలేదు అది పామూ కాదు; తేలూకాదు. అదంతా ఒక మాయ, మంత్రం ఏదో అర్థం కానిది." ఆశ్చర్యంతో అన్నది సుబ్బన్న భార్య.

సుబ్బన్న ఆమెనూరకుండుమని కసురుకొన్నాడు. "ఊరకుండు. తెలివిమాలి మాట్లాడవద్దు. రామప్ప కాటు నుంచీ నెత్తురు పీల్చి పిల్లవాణ్ణి కాపాడాడు. అతడిప్పుడు చాలా తీవ్రంగా విషంతో బాధపడు తున్నాడు."

సుబ్బన్న భార్య ఊరకుండమంటే ఊరకుండే ఘటమా! ఆమె రామప్ప మీద నేరారోపణ చేస్తూనే వున్నది. "ఈ పిల్లవాడు వాని దగ్గరికెందుకెళ్ళాడో? అదే ఇదంతటికీ కారణం."

సుబ్బన్న తన కోపాన్నణచుకొన్నాడు. అతడు తన భార్య మాటలను వినీవిననట్లుగా ఉండి తనపని తాను చేసుకొని పోతుండేవాడు.

అతనికి తన తమ్ముడు సేలంలో చాలా ప్రమాద కర పరిస్థితిలో ఉన్నాడనీ, అతని వ్యాధి గుణమయ్యే అవకాశాలు చాలా తక్కువగా ఉన్నాయనీ సమా చారం అందింది. అతడు ఎకాయెకి సేలం బయల్దే రాడు.

"తమ్ముడూ," అన్నాడు సుబ్బన్న, నేను నీ పట్ల చాలా ఘోరపాపం చేశాను. నీవు నన్ను క్షమిం చవూ?"

సుబ్బన్న కన్నీరు మున్నీరైనాడు.

"అన్నా" అన్నాడు రామప్ప. "ఏడవకు. ఈ పరి స్థితిని తెచ్చిపెట్టింది ఇంట్లోని ఆడవాళ్లు. నిన్ను అం దుకు నిందించవలసిన అవసరంలేదు. ఆ పండని చిన్నపొలాన్ని ఆధారంగా చేసుకొని మనిద్దరం ఏం చేయగలిగేవాళ్ళం ? వృధాగా విలపించకు. నాకువ్యాధి కుదరడం అనుమానాస్పదం. నేను సుమారు రెండు వేలు రూపాయలు కూడబెట్టాను. ఆ దుడ్డు తాశీల్దారు గారి రక్షణలో ఉంది. అతడు ఆ డబ్బును బ్యాంకులో ఉంచాడు. నేనుబ్రతికినా, చచ్చినా అది కుప్పుగాని ఆస్తే."

రెండురోజులు సెలవుమీద తహశీల్దారుకూడా అక్క డికి వచ్చివుండినాడు. రామప్పను చూడడానికి. అతడు రామప్ప తన అన్నకు చెప్పుతున్న మాటలను వింటు న్నాడు.

ప్రక్కన నిలబడిఉన్న డాక్టరు స్వామినాథయ్యరు దికు తిరిగి అతడాశ్చర్యంతో అన్నాడు. "రామాయ ణం పురాతనగాథ. కానీ ఇంకా మనజన్మభూమిలో నేటికీ రామభరతుల్లాంటి వ్యక్తులు కొందరుంటున్నట్లు మనం గమనించగలం.'

# రాజేంద్రయాదవ్ (హిందీ కథకుడు) కథలలో ఎలియనేషన్

—డా॥ జి. ఉషాలావణ్య.

సాధారణంగా 'Man is a social animal' అన్న మాటతో మన చదువులు మొదలవుతాయి. అంటే, మనిషి సంఘజీవి-ప్రతివ్యక్తి సంఘంలో తన తోటి వ్యక్తుల భావాభిప్రాయాలను అర్థం చేసుకుంటూ, వీలైనంత వరకు వారి అభిప్రాయాలకు అనుగుణంగా వారి సలహాలను పాటిస్తూనే తనకు కావల్సిన రకంగా తన జీవితాన్ని మలచుకుంటూ శాంతియుత సహజీవనం సాగించాలని చూస్తాడు. ఒక్కోసారి మాత్రం కారణాంతరాల వల్ల యితరులు ఆశించే ప్రకారంగా కాకుండా తనకు సరైనదని తోచిన మార్గంలోనే ముందుకు సాగేందుకు ప్రయత్నిస్తాడు. ఇటువంటి సందర్భాలలో యితరుల సలహా సహకారాలు లభించవు సరికదా ప్రతిచిన్న విషయానికి వారితో ఘర్షణ పడాల్సి వస్తుంది. ఇక్కడ ఎవరి దృక్పథం సరైనదన్నది సమస్యకాదు.'సత్యం' అన్నది relative terur. ఒక నాణేనికి రెండు వైపులున్నట్టే సత్యానికి కూడా వేర్వేరు approaches వుంటాయి. సాధారణంగా రచయితలు ఈ సత్యా-సత్యే వివేచనకు ప్రాధాన్యత నిస్తూ మానవ జీవితంలోని వివిధ అంశాలను విభిన్న మనస్తత్వాల వారు ఏ విధంగా భిన్న భిన్న రీతులలో ఎదుర్కొంటారో విశ్లేషిస్తూ రచనలు చేస్తారు.

స్వాతంత్ర్యోత్తర సాహిత్యంలో దేశంలో ఏర్పడిన రాజకీయ సామాజిక సాంస్కృతిక అస్తవ్యస్తతను ఆధారంగా చేసుకుని ఎన్నో అభిప్రాయాలు వ్యక్తం చేయబడ్డాయి. వాటిలో సామ్యవాద సమాజ స్థాపనకు సంబంధించిన దృక్పథం ఒకటైతే, మానవ జీవితంలోని అసంబద్ధతకు అద్దం పడుతూనే జీవితానికో సార్థకతను ఆపాదించే ప్రయత్నం చేసే అస్తిత్వ వాద దృక్పథం మరొకటి. అంటే ఆధునిక యుగంలో స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత కూడా సామాజిక వాతావరణంలో ఎటువంటి మార్పు రాకపోవడము, ఆ పైన భిన్న వర్గాల-భిన్న మనస్తత్వాల స్వార్థచింతన వల్ల వాద వివాదాలు తలెత్తి సామాజిక జీవితం సమస్యల మయమై పోవడమూ చూసి వ్యక్తి అసంతృప్తి పాలౌతున్నాడు. సామాజిక నైతిక విలువలకు ఏ మాత్రం విలువ లభించక పోవడము – ఆ విలువలను కాపాడేందుకు చేసే ప్రయత్నాలు వికటించడమూ చూసి తన అసమర్థతకు, అధికార రహిత స్థితికి చింతిస్తూ తన అసంతోషాన్ని, అసంతృప్తిని ఎన్నో రకాలుగా అభివ్యక్తం చేసే ప్రయత్నం చేశాడు మరో రకంగా చెప్పాలంటే సాంఘిక జీవితంలో ఏర్పడిన వైమనస్యాలు, అంతర్బాహ్య సంఘర్షణలే నేటి సాహిత్య రచనకు మూలం. అయితే ఈ సమస్యలకు – పరిస్థితులకు వెనక గల కారణ కార్యాలకు మధ్య సంబంధం వుండదు. అందుకే ఈ అసంబద్ధ జీవితాన్ని విశ్లేషిస్తూ అస్తిత్వ వాదులు కొన్ని విషయాలు ప్రతిపాదించారు.- మనిషి పుట్టుకకు అర్థంలేదు. అతడీలోకంలోకి ఎందుకు వస్తాడో, ఎలా వస్తాడో తెలియదు. ఈ లోకంలో జన్మించిన తర్వాత మాత్రం చావు పుట్టుకల మధ్య జీవితంలో ఆశించినది లభ్యంకాక-కోరుకున్నది పొందలేక నిరాశా నిస్పృహలకు లోనవాల్సివచ్చినా ఈ జీవితాన్ని భరించక తప్పదు. ఆతైన జీవనగమనంలో

వాటంతటవే లభ్యమయే సుఖదుఃఖాలను సమానంగా స్వీకరించడము, వీలయినంత వరకు కోరుకున్నది పొందే ప్రయత్నంలో పరిస్థితులతోను, తోటి మనుషులతోనే గాక తనలోతానే సంఘర్షణ పడవల్సి వచ్చినా అలా సంఘర్షిస్తూ ముందుకు సాగటమే జీవితం। ఈ ప్రయత్నంలో ఒక్కోసారి పరిస్థితులకు తలఒగ్గి యాంత్రికంగా బ్రతకాల్సి వస్తుంది. ఈ స్థితిని విశ్లేషించేందుకే అస్తిత్వవాద చింతన పద్ధతిలో 'ఎలియనేషన్' (Alienation) అన్నపదం వాడుకలోకి వచ్చింది. తత్వశాస్త్రంలోనే గాక సామాజిక మనోవైజ్ఞానిక శాస్త్రాలలోనూ ఈ పదప్రయోగం కనిపిస్తుంది. వీరంతా స్థూలంగా నిర్ధారించినది ఒకటే- వ్యక్తుల మధ్యగల సన్నిహిత సంబంధాలు విచ్ఛిన్నం అవటం వల్ల ప్రతివ్యక్తి ఇంత పెద్దలోకంలో తను చాలా 'ఒంటరి' అన్న భావానికి లోనవుతాడు. అంటే ఏ వ్యక్తి అయినా యితర వ్యక్తులనుంచిగాని, వస్తువులనుంచి గాని విడిపోవాల్సి వచ్చినప్పుడు లేదా స్నేహితులతోను ఆత్మీయులతోను మునుపటి సన్నిహిత సంబంధాలు నిలుపుకోలేక పోయినప్పుడు ఆత్మన్యూనతాభావం ఏర్పడి అసంతృప్తితో ఆత్మ ఘాతక ప్రవృత్తికి లోనౌతున్నాడు. లేదా జీవితానికో అర్థంగాని, లక్ష్యంగాని లేకుండా నిరర్థకంగా బ్రతకవలసి రావడం తన అసమర్థతగా భావించి, దానినుంచి బయటపడే మార్గం తెలియక నిరుత్సాహంతో సామాజిక వ్యక్తిగత జీవన వికాసానికి ఏ మాత్రం ప్రయత్నించకుండా తన పతనానికి తానే కారణమవుతున్నాడు.

ఇటువంటి మానవ స్వభావాన్ని విశ్లేషిస్తూ 'ఎలియనేషన్' అన్న సిద్ధాంతాన్ని ప్రప్రథమంగా ప్రతిపాదించిన వ్యక్తి హీగెల్. ఆ తర్వాత కారల్‌మార్క్స్ సమాజ-ఆర్థిక పరిస్థితుల కనుగుణంగా ఈ విషయాన్ని ప్రతిపాదిస్తే, మానవ మాత్రుడి మానసిక స్థితిని అర్థం చేసుకునే ప్రయత్నంలో ఇదే విషయాన్ని ప్రస్తావించారు మన సత్త్వవేత్తలు. ఈ సందర్భంలో ఒక విషయం తప్పనిసరిగా గుర్తుంచుకోవాలి— వ్యక్తుల చిత్తవృత్తులు సామాజిక స్థితిగతులు అన్యోన్యాశ్రితాలు కాబట్టే కొన్నికొన్ని విషమ పరిస్థితులలో ఏవో కొన్ని విషాదానుభూతులకు లోనై సమాజంతోను-యితర వ్యక్తులతోను సంబంధ విచ్ఛేదంచేసుకుని ఒంటరితనానికిగురిఅవుతాడు. అందుకేసమాజశాస్త్రజ్ఞులమన సత్త్వవేత్తల అధ్యయన సారం ఒకటేగా అనిపిస్తుంది వీరు చెప్పేదేమిటంటే ప్రకృతి ఒడిలో కళ్ళు తెరిచిన పసిబిడ్డ క్రమంగా ఆత్మజ్ఞానం అభివృద్ధి చెందటం వల్ల ప్రకృతికీ తనకు మధ్యగల తేడాలను గుర్తిస్తాడు. ఇది ప్రస్థాపనకు మొదటి మెట్టు. ఆ తర్వాత తన విశిష్ట వ్యక్తిత్వంతోనూ-ఒక విధమైన awareness తోను యితర వ్యక్తుల నుంచి కూడా విడిపోతాడు. అయితే హీగెల్ అన్నట్టు వ్యక్తిగత విశిష్టతలన్నీ వైశ్విక విశిష్టతలోని భాగాలే రెంటికీ వేర్వేరు అస్తిత్వాలు వుండటం ఎంత సహజమో ఆ రెంటి మధ్య పరస్పర వైరుధ్యాలు ఏర్పడటం కూడా అంతే సహజం. తత్ఫలితంగానే సమాజం నుంచి వ్యక్తి ప్రస్థాపన మొదలవుతుంది. ఇది ఎలియనేషన్ లోని రెండవ దశ. ఈ దశలో ఈ వేర్పాటు ధోరణి వల్ల ఏర్పడిన విభేధాలనించి విముక్తి పొందేందుకు అతడు ఆత్మార్పణగావించుకునేందుకు సిద్ధపడతాడు. దాని వల్ల తన నిజత్వాన్ని - తన సహజ వ్యక్తిత్వాన్ని పోగోట్టుకుని, తన ప్రస్తుత రూపం తనకే వింతగా అపరిచితంగా అనిపించినా తప్పనిసరి పరిస్థితులలో ఆ రూపాన్నే స్వీకరించవలసి రావటం వల్ల తన అసమర్థతకు - చేతగాని తనానికి చింతిస్తూ ఆత్మన్యూతతో కృంగి పోతాడు. దీన్నే ఆత్మ ప్రస్థాపన (self-alienation) అనవచ్చు మానవ జీవితంలో అతి ప్రధాన పాత్ర వహించే ప్రేమానుభూతిని ఆధారం చేసుకుని ఈ మానసిక స్థితిని విశ్లేషించే ప్రయత్నం శాస్త్రజ్ఞులు చేశారు. వీరి ప్రకారం ప్రతి వ్యక్తి తన విశిష్ట వ్యక్తిత్వాన్ని దృష్టిలో వుంచుకుని తాను ప్రేమించిన వ్యక్తిని పొందే ప్రయత్నంలో తమ యిద్దరి వ్యక్తిత్వాలలోని భిన్నత్వాన్ని మర్చి

పోయి ఏకత్వాన్ని సాధించే ప్రయత్నం చేస్తాడు. అయితే ప్రేమను పొందేందుకు చేసే ప్రయత్నాలలో అవరోధాలు ఏర్పడిఎప్పుడైతే వీరిమధ్య స్నేహసంబంధాలు విచ్ఛిన్నం అవుతాయో అప్పటినించే వారిలో ఆత్మ ప్రస్థాపనకు సంబంధించిన బావాభిప్రాయాలు చెలరేగుతాయి. తత్ఫలితంగా అంతవరకు ప్రాణంగా బావించిన వ్యక్తిని పూర్తిగా పరాయి మనిషిగా బావించడమూ లేదా తన యిష్టాయిష్టాలకు - సహజ స్వభావానికి విరుద్ధంగా ప్రవర్తించవలసి రావటం వల్ల, తన వ్యక్తిత్వాభివ్యక్తికి అవకాశం లభించక పోవటం వల్ల, వివేకాన్ని, మానసిక చైతన్యాన్ని కోల్పోయి, ప్రతి చిన్న విషయానికి చిరాకుపడుతూ అసంతృప్తి పాలై చివరికి ఆత్మ ఘాతక ప్రవృత్తికి లోనవడమో లేదా హింసాత్మక చర్యలకు పూనుకోవడమో జరుగుతుంది. జీవితం పట్ల విరక్తి లాంటి భావన ఏర్పడటం వల్ల నష్టపోయేది అతడేనన్న నిజాన్ని గుర్తించలేక పోవటం యిందులో ఒక భాగం.

ఆధునికహిందీ కథా సాహిత్యంలో అజ్ఞేయ,నిర్మల్ వర్మ, రాజేంద్రయాదవ్ మొదలైన వారిరచనల్లో ఆధునిక స్థితిగతుల, వ్యక్తుల మనోవృత్తుల విశ్లేషణ'ఎలియనిషన్' ద్వారా చాలా సమర్ధవంతంగా జరిగింది. ముఖ్యంగా రాజేంద్ర యాదవ్ కథలలో (ఈయన కథలు 'దేవతావోంకి మూర్తియా', 'ఖేల్ ఖిలౌనే', 'జహాలక్ష్మి కైద్ హై', 'ఛోటే ఛోటే తాజ్ మహల్', 'కినారే సే కినారె తక్', 'టూట్ నా', 'ఢోల్', 'అపనేపార్'అన్న సంకలనాల్లో ప్రచురింపబడ్డాయి) ఈ ధోరణిలోనే వ్యక్తుల అంతర్గత జీవితాలను స్పష్టం చేసే ప్రయత్నం కనిపిస్తుంది. ఇక్కడ రెండు మూడు కథలను వుదహరిస్తే చాలు ఎలియనేషన్ స్వరూపం యావత్తూ స్పష్టం అవుతుంది.

'ప్రతీక్ష' లో గీత అనే మధ్యవయస్కురాలు 'నంద' అనే మరోయువతిని తనకు తోడుగా వుంచుకోవటము, ఆ తర్వాత నంద స్నేహితుడు హర్ష రాకతో వారిద్దరూ సాయంత్రాలు ఎక్కువ భాగం బయట గడపటము, వారి రాకకోసం గీత ఎదురుచూస్తూ గడపటమూ వర్ణించబడింది. ఇందులో ఆరంభంలోనే రచయిత అతి చక్కగా గీతలోని రెండు పరస్పర విరుద్ధ భావాలను వ్యక్తం చేస్తూ ఆత్మ ప్రస్థాపన అన్నది ఎలా మొదలవుతుందో చూపించారు. అంటే ఆమెతో ఒక భాగం నంద రాకపోకలకు పెద్ద ప్రాధాన్యతను యివ్వకుండా వుద్వేగరహితంగా నిశ్చింతగా తనపనులు తను చేసుకుంటూ పోతే, మరోభాగం ప్రతి చిన్న అలికిడికి వులికిపడుతూ, ఆశనిరాశల మధ్య వేగిపోతూ, మానసిక ఒత్తిడులకు గురిఅవుతూ వుంటుంది. ఇదే ఆమె నిజ స్వరూపం. నందను విడిచి వుండలేని కారణంగానే హర్ష వచ్చిన తర్వాత హోటల్లో వుండాలన్న వారి నిర్ణయాన్ని మార్చి యిద్దరూ తన యింట్లోనే వుండే ఏర్పాట్లు చేస్తుంది. తన ముందు వారిద్దరూ చలోక్తులు విసురుకుంటూ సరదాగా గడపటం ఆమెకు బాగానే అనిపించినా రానురాను తనకంటే హర్ష ఆమెకు ఆత్మీయుడన్న నిజాన్ని ఆమె భరించలేక పోతుంది. అయితే ఆ భావాన్ని ఎక్కడా వ్యక్తం చేయదు. వారి విచ్చలవిడితనాన్ని హర్షించలేకపోయినా వారిని వారించలేని తన అసమర్ధతకు అంతర్గతంగా నలిగిపోతూ, తన నిస్సహాయస్థితికి తనపై తనే జాలిపడుతూ ఆత్మన్యూనతతో బాధపడుతూ వుంటుందే గాని వారిని అడ్డుకుని వారిని దూరం చేసుకునే పని మాత్రం చెయ్యదు-చెయ్యలేదు. నంద హర్షల వెంట తానూ తిరిగే అవకాశం లభించినా వాళ్ళిద్దరూ ఒకటి, తను ఒంటరిది అన్న ఆలోచన ఆమెను వదలదు అందుకు లోలోపల చిరాకుపడిపోతూనే పైకిమాత్రం వారు తనకెంతో ఆత్మీయులన్న భావం వ్యక్తం చేస్తుంది. ఆమెకు తెలుసు-తన మాటల్లోనూ చేతల్లోనూ సహజత్వం లోపిస్తోందని. తన యిష్టాయిష్టాలకు విరుద్ధంగా ప్రవర్తించే హర్షనందలను తను ఎలా భరించగలుగుతోందో అని ఆమె విస్తుబోతూనే వుంటుంది. పైకి సహజంగా సంతోషంగా వున్నట్టు ప్రవర్తించినా

లోలోపల సంఘర్షణకు గురౌతూవుంటుంది, హోటల్ నుంచి తనను విడిగా టాక్సీలో పంపించి, ఆ తర్వాత వాళ్ళిద్దరూ వచ్చే ప్రస్తావనకు హర్షించలేక పోయినా పైకి అతి వుదారంగా దానిదేముంది. రోజూ ఒంటరిగానే కదా వెళ్ళేది, అని సర్దుకు పోవటంలోనూ, హర్ష తన ముందు సిగరెట్ తాగటం యిష్టంలేకున్నా అనుమతించడంలోనూ-ఆ తర్వాత యిలా ఎలా చేయగలిగాను అని ఆశ్చర్యపోవటంలోనూ రచయిత ఈ మనస్థితిని చక్కగా చూపించారు.

ఇక హర్ష తన భార్య కారణంగా నందను వివాహమాడలేని తన అశక్తతను వ్యక్తం చేస్తూ ఆమె మూర్ఖంగా భర్త పూర్తిగా తనవాడే కావాలని పట్టుబట్టి పూజలు వ్రతాలు చేయడము, అందుకు తగ్గట్టే తను కూడా తనను తాను ఆమెకు అర్పించుకునే ప్రయత్నం మనస్ఫూర్తిగా చేసి విఫలమవటమూ, నంద పట్ల రోజు రోజుకు ఆకర్షణ పెరుగుతూ పోవటమూ గురించి చెప్పి ఏదో ఒకరోజు తన భార్యనుంచి, తను వేరుపడక తప్పదన్న నిర్ణయానికి వచ్చి 'she will have to lose me whole' అని అనటంలో తను తన భార్యకు మానసికంగా ఎంత దూరమయాడో గుర్తించినా అందుకు అంతర్గతంగా అపరాధ భావజనితమైన వ్యధకూ లోనవటం స్పష్టంగా తెలుస్తుంది. ఇదికూడా self elienationలో ఒక భాగమే, ఎవరినీ తప్పుపట్టలేనిస్థితి యిది. పరిస్థితుల్ని నిస్సహాయంగా స్వీకరించి సర్దుకు పోవటం మినహా మరో దారిలేని జీవితాలు వారివి.

'పురానే నాలే పర్ నయా ఫ్లాట్' భార్యాభర్తలు మానసికంగా ఒకరికొకరు ఎలా దూరమవుతారో, దాంపత్య సంబంధాలు ఎంత అర్ధరహితంగా మారతాయో, అయినా ప్రతి విషయంలోనూ రాజీపడుతూ యాంత్రికంగా ఎలా బతకాల్సి వస్తుందో చూపించే కథ. ఇందులో బీరూ అనే యువతి రచయితకు వుత్తరాలు వ్రాస్తూవుంటుంది. ఆ వ్రాయటంలో పైకి రచయిత ఆమెకు ఎంతో దగ్గరవాడన్న భావనవ్యక్తం అయినా నిజానికి తనను ఏ మాత్రం పట్టించుకోని తన భర్త నిర్లక్ష్యవైఖరికి కృంగిపోయి పరాయి మనిషితో స్నేహం పెంచుకుని ఆత్మన్యూనతా భావం నుంచి బయట పడేందుకు, తనకూ స్నేహితులూ ఆత్మీయులూ వున్నారని చెప్పాలన్న తాపత్రయమే ఎక్కువగా కనిపిస్తుంది. తమ వైవాహిక జీవితంలో ఏర్పడిన వెలితిని వ్యక్తం చేయటంలోనూ రచయిత నుంచి సాంత్వనసానుభూతులు పొందాలన్న ఆలోచన కాకుండా తన మనసులో ఏర్పడిన అగాధాన్ని పూడ్చుకోలేని తన నిస్సహాయతను వ్యక్తం చేయాలన్న ఆరాటమే కనిపిస్తుంది. వివాహమైన నెలలోనే భర్తకు 'దీప్తి' అన్న మరోస్నేహితురాలు వుందన్న సత్యాన్ని ఆమె జీర్ణించుకోలేక పోవటం యిందులో ముఖ్య సమస్య. భర్త తనను మోసగించాడని బాధపడి, ఏడ్చి, మొహం మాడ్చుకు చివరకు భర్త మారడు అని తెలుసుకుని తనే మారే ప్రయత్నంలో విఫలం అయి తన జీవితానికో అర్ధం అంటూ లేదన్న నిస్పృహకు లోనవుతుంది. అయితే భర్త ఎన్నో విధాలుగా నచ్చచెప్పేక రాజీపడేందుకు చూస్తుంది. ఇద్దరు వ్యక్తులు ఈ దగ్గర అవటానికి అప్పుడప్పుడు పోట్లాడటం కూడా అవసరమేననీ అంటూ, లేని వుత్సాహం తెచ్చుకుని భర్త అవసరాలన్నీ గమనించి ముందుముందుగా అతనికి కావాల్సినవి అమరుస్తూవుంటుంది. అయితే ఆమెకు తను చేసే ప్రయత్నాలన్నీ విరిగిన బంధానికి అతుకు పెట్టినట్టుగానే అనిపిస్తాయి. క్రమంగా ఇందులో సహజత్వం లేదు-ఇదంతా నటన, నిజమైన ప్రేమకాదు అన్నభావం ఆమెలో బలపడుతుంది. తనలో ఏర్పడిన వెలితిని, ఆ వెలితికి కారణమైన వ్యక్తి కూడా ఎప్పటికీ పూరించలేడని తెలుసు. దానితో జీవితం మరింత నిరర్ధకంగా చప్పగా అనిపించినా భరించక తప్పదు కాబట్టి యాంత్రికంగా రోజులు గడిపేస్తుంది. అయితే భర్త నిర్లిప్తత నిరాదరణ ఆమె మనసును ఎంతగా గాయపరిచాయో ఒక్కే ఒక్క సందర్భంలో

వ్యక్తం చేస్తుంది. ఇంటి పక్కనేవున్న మురికి కాల్వ దుర్గంధాన్ని ఎన్నో రోజులుగా భరిస్తున్నా ఆఫీసు నుంచి తిరిగి వచ్చిన భర్త 'ఈ రోజు వాసనఎక్కువగా వుంది' అనగానే అవును ఇన్నిరోజులు భరించలేక పోయినా ఏదోరకంగా అలవాటు పడిపోయాం కానీ ఈరోజు ఏదో మరీ కొత్తవాసన-ఏదో చచ్చిన వాసన కదా? అంటుంది. ఆ అనటంలో నీయింట్లో నీ భార్య చచ్చి కుళ్ళిపడుంది. అయినా నీకామె ధ్యాసే లేదు. నిదానంగా యిక దీనికి అలవాటుపడతావులే' అన్న వ్యంగ్యార్థం వుంది. ఇటువంటి పరిస్థితుల్లో బ్రతకాల్సి వచ్చినప్పుడు-వ్యక్తి అభీష్టాలు అర్థరహితంగా మారి కోరుకున్నది లభ్యంకానప్పుడు ఆత్మహత్యలకు పాల్పడే అవకాశం వుంది. అయితే జీవితాన్ని అస్తిత్వవాద దృక్పథంలో అవగాహన చేసుకున్నవారు జీవితం దుఃఖభరితం అని తెలుసు కాబట్టి ఏదో రకంగా బ్రతుకు సమరం సాగించే ప్రయత్నం చేస్తారు. అందుకే బీరూ కూడా అంటుంది-"చావాలని కాదుగానీ, నేనెందుకు బ్రతుకుతున్నాను? ఈ జీవితానికి అర్థం ఏమిటి అని ఎన్ని రాత్రులు ఆలోచిస్తూ, ఏడుస్తూ గడిపానో తెలుసా?" అని. ఈ ప్రశ్నించడం లోనే జవాబూ వుంది-పరిస్థితుల ప్రవాహంలో పడి కొట్టుకుపోతూ రాత్రి పగళ్ళకు తేడాకూడా తెలియకుండా నిట్టూర్పులతో గడిపి చివరికి భవిష్యత్ వర్తమానాల పట్ల కూడా ఆసక్తిని కోల్పోవడము-నిరర్థకంగా నిస్సారమైన బ్రతుకు సాగించడమే జీవితం అని

'కినారే సే కినారే తక్' అన్న కథలో మానిక్ ఆఫీసు పనిమీద కలకత్తా వెళ్ళి అక్కడ తన భార్య ప్రమీల కోరిక మీదట ఆమె స్నేహితుడు కాంత్ యింట్లో బస చేయటము, ఆ తర్వాత వారి పుత్రుడు రూబీతో బేలూరు చూసేందుకు నావలో వెళ్తూ అవతలి తీరం చేరుకునే లోపులో రూబీని నీళ్ళలోకి తోసేసి చంపేస్తే బావుంటుందన్న కోరికను అదుపులో పెట్టుకోడానికి ఎలా సతమతమవుతాడో చూపించబడింది. తన కొడుకు అనూప్, కాంత్ కొడుకు రూబీ ముమ్మూర్తులా ఒకే పోలికలో వుండటం వల్ల అనూప్ తన కొడుకు కాదేమోనని మొదటి నుంచి అతడిలో వున్న భావన ఈ చర్యకు పాల్పడేలా చేస్తుంది. తన మరదలు అంతక్రితం అనూప్‌లో కాంత్ పోలికలు చాలా వున్నాయని అన్నప్పుడు పట్టించుకోక పోయినా కాంత్ ఫోటో చూశాక ఆమె మాటల్లో నిజముందేమోనన్న అనుమానం తలెత్తి భార్య శీలాన్ని శంకిస్తూ ప్రతి చిన్న విషయానికి చిరాకు పడుతూ వుంటాడేగాని మనసులో మాట భార్యతో ఎప్పుడూ అనడు. అయితే అతడిలో సంఘర్షణ ఎక్కువై చివరికి డాక్టర్‌తో పరీక్ష చేయించుకుని అనూప్ తన కొడుకో కాదో తెల్సుకునే ప్రయత్నం చేస్తాడు. ఆ తర్వాత మరో ఆడపిల్ల కలిగాక తనలో ఏ లోపము లేదని, అనూప్ కూడా తన బిడ్డేకని వూరట పొంది తిరిగి భార్యా బిడ్డలతో సరదాగా గడపటం మొదలు పెడతాడు. తిరిగి ఎప్పుడైతే రూబీని చూస్తాడో అతడి మనసులో మరలా అదే అనుమానం తలెత్తి, ఆత్మ సంఘర్షణకు లోనై తనలో తానే విపరీతంగా మథన పడతాడు గత ఆరేడేళ్ళలో ప్రతిక్షణం చచ్చి బ్రతుకుతూ నరక యాతన అనుభవిస్తూ వచ్చాడు తన నింతటి మానసిక యాతనకు గురిచేసిన వాళ్ళు మాత్రం హాయిగా వున్నారు. తనేం తప్పుచేశాడని తనకు మాత్రం ఈ శిక్ష? తననింత బాధ పెట్టిన వాళ్ళమీద ప్రతీకారం తీర్చుకుంటే మాత్రమేమి? ఈ ప్రతీకారం తీర్చుకోడానికి రూబీ ఒక సాధనం అవుతున్నాడు. ఇందులో తప్పేముంది! అతడి ఆలోచనలన్నీ ఈ రకంగా సాగినా రూబీ పట్ల ఎప్పుడూ కటువుగా ప్రవర్తించడు నిజానికి రూబీ పట్ల మనసులో వున్న భావన ప్రేమా లేక ప్రతిహింసా అన్నది అతడే నిర్ధారణ చేసుకోలేక పోతాడు.

దీని సారాంశం ఒక్కటే - మనిషి పరిస్థితులకు బానిస. అతడు ఎప్పుడేం చేస్తాడో చెప్పటం సాధ్యం కాదు పరిస్థితుల ప్రభావం వల్ల ఎప్పుడేది తోస్తే అది చేసేసినా - ఆపైన పరిణామాలు ఎంత విషమంగా ఉన్నా-ఎన్ని మనస్తాపాలకు లోనుకావలసి వచ్చినా మౌనంగా భరించక తప్పదు ఇదే జీవితం ఇటువంటి జీవితంలో ఎటువంటి మానసిక స్థితిని ఎదుర్కోవాల్సి వస్తుందో చెప్పటానికి వుపయోగపడే ప్రక్రియే 'ఎలియనేషన్'.

———

# అద్దం

— చల్లా వినయమోహన్

అందరికీ తెల్లవారినట్లే లెక్చరర్ రవికీర్తి ఇంట్లో కూడ తెల్లవారింది. ఇంటి ముందు దేవకాంత చెట్టు ఎఱ్ఱగా పూచిన పూలలో కొన్ని క్రిందకి రాలి 'రెడ్ కార్పెట్' పఱచినట్లుగా ఉంది. రకరకాల పక్షులు తమలో తాము హాలో అనుకొంటున్నట్లుగా కూస్తున్నాయి. నైట్‌క్వీన్ పూలు రాత్రంతా వేచి యుండి అలసిపోయినట్లుగా ముడుచుకొని పోయాయి. సువాసన ఇంకా ముందుగదిలో తచ్చాడుతూనే ఉంది. కుర్చీలో కూర్చుని పేపరు చదువుతున్న రవికీర్తిని "టీ" ఇదిగోనండి అంటూ పలకరించిన భార్యను చూచి-ప్రక్క ఇంట్లో హడావిడిగా ఉందేమిటి? అని ప్రశ్నించాడు 'టీ' అందుకొంటూ. ఇంజనీరుగారట-ట్రాన్స్‌ఫర్ మీద ఈ ఊరు వచ్చారు. పనిమనిషిని కుదర్చమని వాళ్ళావిడ ప్రొద్దుట పలకరించింది అంటూ-మొఖం అదోలా పెట్టింది రమ్య - మళ్ళీ తమాయించుకొని ఎంత సామాను అనుకొన్నారు-ప్రతిదీ రెండేసి ఉన్నాయి అనగానే రవికీర్తి అడ్డం వచ్చి ఏమిటి భార్యలు కూడానా? అన్నాడు. ఛీ; ఊరుకోండి ఆడవాళ్ళంటే అంతలోకువా ఏమిటి? నేను చెప్పేది సామాన్ల సంగతి. ఫ్రిజ్, ఇది ఒకటే లెండి. రెండు డైనింగ్ సెట్లు, రెండు గాడ్రెజ్ బీరువాలు, రెండు జోళ్ళ స్టాండులు - టీపాయ్ సెట్ చాల బాగుందండి. డబుల్ కాట్ ఫాంటాస్టిక్‌గా ఉందండి మనదీ ఉంది, ఒకటే చప్పుడు అంటూ మళ్ళీ ఏదో జ్ఞాపకం వచ్చి నవ్వుకొంది. రవికీర్తి నవ్వుతూ మిసెస్‌రమ్యా రవికీర్తి ఆయన ఇంజనీరు అని నువ్వే చెప్పావుగా వారికి ప్రతిదీ రెండేసి ఉంటేగాని తృప్తి ఉండదు. వాళ్ళ గురించి ఆలోచించి మనసు పాడు చేసుకోకు అంటూ పేపర్లో నిమగ్నమైనాడు రవికీర్తి.

రమ్య కొంచెం కోపంగానే 'టీ' కప్పు తీస్తూ అవున్లెండి మనకేం ఉంటాయి దిద్ద వలసిన పేపరు కట్టలు అయిపోయిన రెడ్ రీఫిల్స్ అపుడపుడు జేబులో మర్చిపోయిన సుద్దముక్కలు అంతేగా! అని విసురుగా లోనికి వెళ్ళి పోయింది.

రమ్య కొంచెం ముక్కోపి. అయినా భర్త అంటే చాల ఇష్టం. ఆ ఇష్టాన్ని భర్తకు కష్టం రాకుండా చూచుకోవటంలో తెలియ చేస్తుంది. కాని ఎందుకో భర్తమీద అనుమానం. ఎన్నో సందర్భాలలో రవికీర్తి భార్య అనుమానాన్ని పోగొట్టటానికి ప్రయత్నించి విఫలమయ్యాడు. చివరికి ఒకసారి-

రవికీర్తి బెడ్‌రూం కిటికీ ఎదురుగానే ఇంజనీరు గారి డ్రస్సింగ్ రూం కిటికీ, సరిగా ఆ కిటికీ తిన్నగా వాళ్ళు డ్రెస్సింగ్ టేబుల్ ఏర్పాటు చేసుకొన్నారు. ఒకరోజు రవికీర్తి తన అద్దంలో షేవింగ్ చేసుకొంటుండగా ఇంజనీరుగారి భార్య తలదువ్వుకొంటూంది. 'టీ' తీసుకొచ్చిన రమ్య భర్త షేవింగ్ చేసుకోవటం పరధ్యానంగా చూస్తూ అద్దంలో ఇంజనీరుగారి భార్య కనిపించటంతో ముఖం అదోలా అయిపోయి. టీ కప్పు టేబుల్‌పై పెట్టి లోపలికెళ్ళి పోయింది. అలా వెళ్ళటం రవికీర్తి కనిపెట్టి తనలో నవ్వుకొన్నాడు. భార్యకు అనుమానం భర్తకు ఆనందంగా సాగుతుంది వారి సంసారం. అలా రోజులు గడుస్తున్నాయి

ఒకరోజు మధ్యాహ్నం రేడియోలో వివిధభారతి వింటూ "లేసు" కుట్టుకొంటున్న రమ్యను పల్కరించటానికి వచ్చింది-ఇంజనీరు గారి భార్య. రమ్య లేచి రండి అంటూ ఆమెను లోనికి ఆహ్వానించింది. సాయంత్రం సినిమా కెళదాం వస్తారా అని రమ్యను అడగ్గానే మావారి పర్మిషన్ తీసుకొని వస్తానండి-అని బదులిచ్చింది. ఆమాటల్లోనే ఆమె పేరు 'నవతార' అని,ఆమెకు ఒక కొడుకు, ఒక కూతురని హైదరాబాదులో కాన్వెంటులో చదువుతున్నారని తెలుసుకొన్నది. రమ్య-మరి మీరేమీ చెప్పారు కాదని 'నవతార' అనగానే రమ్య తేరుకుని-మా వారు లెక్చరర్. మాకు ఒక అబ్బాయి. పేరు చంద్రచూడ్- ఇక్కడే వీధిబడిలో చదువుతున్నాడు. వాడి నాన్న గార్కి ఈ కాన్వెంట్ చదువులు ఇష్టం ఉండవు-కేవలం దేశవాళీ బడుల్లోనే కష్టసుఖాలు తెలుస్తాయని ఆయన సిద్ధాంతం-అంటూ తన పిల్లాడి చదువును సమర్థించుకొన్నది. మర్చేపోయాను కొంచెం 'టీ' తీసుకొనివస్తాను ఈ మాగజైన్ చూస్తూ ఉండండి అంటూ "భారతి'ని చేతికిచ్చి వంటింట్లోకి వెళ్ళింది రమ్య.

మాగజైన్ తిరగేయకుండానే బెడ్‌రూం పరిసరాలను పరికిస్తూ ఉండి పోయింది నవతార. టేబుల్ మీద చిందర వందరగా పడిఉన్న పుస్తకాలు, సగం వ్రాసిన ఏవో కాగితాలు, భార్యాభర్తల ఫోటో, పాకెట్ రేడియో, గోడలమీద గోల్డెన్ టెంపుల్ ఫోటో, త్రిమూర్తుల ఆర్ట్, అపుడే ఉదయిస్తున్న సూర్యుడిఫోటో, వ్రేలాడదీసి ఉన్నాయి. డబుల్‌కాట్‌మాత్రం నవతారకు బాగా నచ్చింది. డ్రస్సింగ్ టేబుల్‌కూడా బాగా నచ్చింది. రమ్య 'టీ' తీసుకొని రాగానే మీ అద్దంలోనుండి చూస్తే మారూం కనిపిస్తుందే అని ఆశ్చర్యంగా అడిగింది నవతార. అవునండి అనుకోకుండా జరిగింది. అని గమ్మున ఊరుకొంది. 'టీ' త్రాగి సాయంత్రం కలుద్దామని తిరిగి వెళ్ళిపోయింది నవతార.

అద్దం మిషతో రవికీర్తిమీద కోపాన్ని వాళ్ళ అబ్బాయిమీద చూపెడుతూనే ఉంది రమ్య. అద్దం రమ్యపట్ల ఒకశాపంగా తయారయ్యింది. మనసులో ఏదో బెంగ. మనిషి బాగా డీలా అయిపోయింది. ఈ బాధ భరించలేక కొన్నాళ్ళు వాళ్ళ అమ్మగారింటికి వెళ్ళింది అక్కడ ఉన్నా రవికీర్తి మీద అనుమానం. మళ్ళీ బయలుదేరి భర్తను చేరుకొన్నది.

ఒకరోజు ఉదయాన్నే రమ్య తలస్నానం చేసి వచ్చి జుత్తును ముందుకు వేసుకొని తువాలుతో దులుపు కొంటున్నప్పుడు నీటి తుంపరలు రవికీర్తి ముఖంమీద పడి కళ్ళు తెరచి చూచాడు. రమ్య మెరూన్ కలరు కోటా చెక్డ్ చీర, అదేరంగుజాకెట్టు క్రొత్త అందాలతో మత్తెక్కిస్తుంది ఇంత హుషారుకు కారణమేమిటా? అని ఆలోచిస్తున్న రవికీర్తిని తట్టిలేపుతూ-ఎవండీ గుడ్ న్యూస్. లేవండి ఇంజనీరు గార్కి ప్రమోషన్ మీద ట్రాన్స్‌ఫర్ అయిందట తొందరగా లేవండి ముఖం కడుక్కోండి మంచి 'టీ' తీసుకొస్తాను అనగానే 'టీ' మాట వినపడి కప్పుకొన్న రగ్గును ప్రక్కకు తొలగించి లేచికూర్చున్నాడు రవికీర్తి. హుషారుగా లోనికి వెళ్ళిపోయింది రమ్య.

రవికీర్తి కాలకృత్యాలు ముగించుకొని వచ్చి అద్దం ముందు జుత్తు సరిచేసుకొంటూ చూచాడు ఎదురుగా కిటికీలో డ్రస్సింగ్ టేబుల్ లేదు. సామాన్లు అన్నీ సర్ది బయట లారీకెత్తుతూ జవాన్లు హడావిడిగా అటూ ఇటూ తిరుగుతున్నారు, "టీ" తెస్తూ రమ్య హాయిగా ఊపిరిపీల్చుకొంది.

లెక్చరర్.
ఎస్.ఎస్.వి.టి. జూనియర్ కాలేజీ
తణుకు-53421.

అలాంటి ఘన సన్మానితుని కవిత్వ వైభవం గురించి స్థానిక పాఠశాలా ప్రధానోపాధ్యాయుడు సుదీర్ఘ ఉపన్యాసం ఇస్తారు. రిట్రైర్డు పోలీసు సర్కిల్ ఇనస్పెక్టర్ కూడా ప్రసంగిస్తాడు దేవుడు మేలు చేస్తే-ఏమన్నా పరిశ్రమల శాఖామాత్యుడో ప్రస్తుతించి-తన దివ్యహస్తాల మీదుగా శాలువ కప్పుతాడు. పతాక సన్నివేశంగా కాకపోయినా ఆ వార్తా ప్రముఖంగా దిన పత్రికలన్నిటా ప్రత్యక్ష మవుతుంది. మన మంతా చదువుతాం. అనతి కాలంలోనే మరచిపోయి బరువు దుచుల్చుకుంటాం. మళ్ళీ ఆకవి గురించి వినవలసిన, తెలుసుకోవలసిన పూచీ మనకా కడే కలిగించదు' ఇదీ లోకధర్మం

అందుకే కరీంనగర్ నుంచి లేఖ రాగానే నాకు నిజంగానే భయంవేసింది మంచి కవి నారాయణ రెడ్డి ఇలాంటి ప్రమాదంలో పడిపోయాడేమో? అని నిజానికి అతనికి సన్మానాల కర్మ ఎందుకూ? అతడు అచ్చమైనకవి, చేపగల భావుకుడు, రుచి శిల్ప శ్రీమంతుడు, సువిశాల ప్రజాహృదయ సుమరాజితో పూజలందుకోగలడు! అలాంటి మంచి కవిని ఈ సన్మానం ఎలాంటి విపత్తులో ముంచుతుందో పాపం, అనుకుంటూ లోలోపల భయపడ్డాను.

"అప్పుడే నారాయణరెడ్డికి సన్మానమా? ఇదేదో కులంబలం కాబోలు!' అనుకుంటూ వెన్ను ముదిరిన ముది మది కవులు గోలుగోలు మనవచ్చుకూడా! ఈ గగ్గోలు ఎలా ఉంటుందంటే-నాకోకథ జ్ఞాపకం వస్తోంది. పాఠకులకు అనుమానం కలక్కుండా చెప్పేయడమే మంచిది... వెనుకటికో బ్రాహ్మణోత్తముడు ఒక సంపన్నుల యింటికి పెళ్ళికి వెళ్ళాడట. పెళ్ళిసందర్భంగా సంభావన లిస్తున్నారట. పెళ్ళిసదస్సులో అగ్రతాంబూలమంటూ పూర్వ సంస్కారుల కివ్వడం పరిపాటి. అది విచారించిన గేస్తు ఒకపండితుడికాఅగ్ర తాంబూలం అందించాడట! వెంటనే యీ బ్రాహ్మణోత్తముడు లేచి "అయ్యా! ఆత్మస్తుతీ పరనిందాలేని మహానుభావుణ్ణి నేనిక్కడుండగా ఆ శుంఠకిస్తున్నారేమిటి అగ్రతాంబూలం?' అంటూ అరవనారంభించాడట! అలా వుంటుంది-గత వైభవాల బ్యాంకు డిపాజిట్లపై బ్రతికే ముదికవుల సంగతి!

ఎవరైనా ఒక వర్ధమానకవికి సన్మానం తలపెట్టారని తెలిస్తే చాలు, ఈ ముదికవులు-తమ కళ్ళముందే గోహత్య జరిగిపోతున్నట్లూ, ఆ పాపం తమ మెడకు చుట్టుకుంటున్నట్లూ గగ్గోలు ప్రారంభిస్తారు.

కరీంనగర్ ఆహ్వానసంఘం వారిలేఖ మరోసారి చదివాను. ఈ మారు నిజంగానే కోపం వచ్చింది. సన్మాన సంచికలో ప్రచురించడానికి నన్ను నారాయణరెడ్డిపై పద్యాలు వ్రాసి పంపమని కోరారు. 'నేను స్తుతి పద్యాలు రాయాలా? ఎవరిమీదనైనా రాశానా?' అని నా మనసు మూలిగింది. ఉత్తరం మళ్ళీ పూర్తిగా చదివాను. ఆలోచించాను నవ్వు వచ్చిందినాకు, అంతే కాదు ఆనందమూ కలిగింది.

నిజమైన కవులకు ఎప్పుడోగాని సన్మానాలు జరగవు. జరిగినా అరకొరగానే! ఇప్పుడు నారాయణ రెడ్డికి జరుగుతోంది. అందునా తాను పుట్టి పెరిగిన జిల్లాలోనే! ఆనందమే కదా! వెంటనే ఆహ్వానసంఘం వారికి జవాబు రాశాను. "మాకు తమ్ముడూ, మా అందరికీ ప్రియతముడూ శ్రీ నారాయణరెడ్డి ఆయనకి సన్మానం జరగడం నాకు నిజంగా ఆనందంగా ఉంది కాని నాకు వ్యక్తులను అభినందిస్తూ రాయడం అలవాటు లేదు. పోనీ వ్యాసం రాసి పంపమంటారా అని.

కొద్ది రోజులు గడిచాయి 26వ తేదీని హైదరాబాద్ నుంచి ఒక లేఖ వచ్చింది. శ్రీ డి రామలింగంగారు సన్మాన సంచికా సంపాదకుడి హోదాలో రాసిన లేఖ... అందులో వారు వ్యాసమే రాసి పంపమన్నారు ఆనాడే కరీంనగర్ నుంచి మరో లేఖ కూడా అందింది. నా అభ్యర్థన మన్నించబడినందుకు తృప్తి కలిగింది.

# నారాయణ చక్రం

— సోమసుందర్

ఎందుకో తెలియదు, ఆవేళ మనసు చికాకుగా వుంది. నిద్రలేవగానే కలిగే ఉత్సాహమూ లేదు. దిగులుగా, బరువుగా వుంది. కారణం తెలియదు. బాగా జ్ఞాపకం నాకు, ఆవేళ డిసెంబరు 12వ తేదీ 1958 సం రం. దినం ముదిరినకొద్దీ ఏదో గ్రంథ పఠనంలో మునిగి పోతోంది మనసు. ఇంతలో పోస్టూ వచ్చింది. తల వని తలంపుగా ఒకలేఖ...కరీంనగర్ నుంచి... సన్మాన సంఘంవారు రాసిన లేఖ...శ్రీ నారాయణ రెడ్డికి సన్మానం చేయబోతున్నట్లూ, వ్యాసం రాసి వెంటనే పంపవలసిందనీ ..

అప్పటికే నారాయణరెడ్డి నాకు నిజంగా మిత్రుడు, ఆప్తమిత్రుడన్నా అతిశయోక్తికాదు దానికి కారణం నిరంతర సాహచర్యం కానక్కరలేదు అంతకు మించినదీ, మరింత బలోపేతమైనదీ ఒక ఆంతరిక బంధమేర్పడింది. భావనలో రసవ్యంజనలో ఒకానొక సుహృత్ బంధమేదో ఉంది మా యిరువురికీ. అది కాళిదాసు చెప్పిన జననాంతర సౌహృదమే అంటారా నాకు అభ్యంతరంలేదు. జన్మలమీదే నమ్మకం లేని వాడికి జననాంతరమెలా పొసగుతుంది. కాని యిది హేతువాద విచికిత్సకు లొంగని సెంటిమెంటే అయితే అభ్యంతర మెందుకుండాలి?

అన్నిటికీ యిదమిద్ధంగా కారణాలేం చెప్పగలం? నాకు నారాయణరెడ్డి మాత్రం సన్నిహితుడు. అతన్ని గురించి భావించే సరికే నాహృదయం ఒక ఆత్మీయ బాంధంతో పెన వేసుకుపోతుంది. అలాంటపుడు మరి నాకీ శుభవార్త సంతోషం కలిగించవలసిందే కదా? ... మరెందుకో నాకు పెద్ద పెట్టున సంతోషం కలగలేదు. ఉత్తరం చూడగానే "ఛా నారాయణ రెడ్డికి అప్పుడే సన్మానమేమిటి ఖర్మ?" అనిపించింది. నిజమేమరి! కృష్ణశాస్త్రిగారికి 1940ల్లో రాజమండ్రి పౌరులు ఒక గొప్ప సన్మానం చేశారు. దానితో పొంగిపోయిన శాస్త్రిగారు యింక మళ్ళీ కవిత్వం జోలికి పోరంటూ చలంగారు ఆనాడే ఒక జోస్యం చెప్పారు. ఆక్షేపించారు. నాకా సంగతి జ్ఞాపకం వచ్చింది. కవులకు పెద్ద ఎత్తున జరిపే సన్మానాలు సాధారణంగా కవిత్వానికీ, సృజనశక్తికీ దింపుడు కళ్ళాలే!

ఆదే నా కానాడు కలిగిన భయం.

పైగా ఇటీవల మరో చమత్కారం భజింప బడు తోంది. కొంత కాలంగా కవులు కానివారికే సన్మానాలు జోరుగా జరుపబడుతున్నాయి. అధికారంతో వున్న ఏ రాజకీయ నాయకుడి ప్రాపకమో లభిస్తే చాలు-ఎవడో ఒక కవికి ఘన సన్మానం జరిగిపోతుంది! మన దేశంలోనా కవులకేంలోటు! ప్రతి కుగ్రామంలోనూ ఒక బత్తెన్నో ఒక బడిపంతులో-మునసబుగారింట పెళ్ళికో, కరణంగారింట చావుకో అర్జంటుగా పద్యాలు రాసేసి చదివేసే మహాభాగులు లక్షలాదిగా ఉన్నారాయె! అలాంటి వారెందరికో సన్మానాలు జరుగుతున్నట్లు-దిన పత్రికల ధర్మమా అని అందరమూ తెలిసికొంటూ తరిస్తూనూ ఉన్నామాయె! ఆ సన్మానితుని పేరు తొలిసారి తుదిసారీ వినడం కూడా అప్పుడే జరుగుతుందాయె!

కాని ఏమిటి వ్రాయడం? నారాయణరెడ్డి అవిరళ కృషి సలుపుతున్న ఉత్తమ సాధకుడు అప్పటికి వెలువడిన గ్రంథాలలో-జలపాతం, విశ్వగీతి వంటి తొలి నాటి కృతులు మాత్రమే నేను చదివాను. నా చిన్న గ్రంథాలయంలో భద్రపరచుకొన్నాను మిగిలిన గ్రంథాలా? చాలా ప్రచురింపబడ్డాయి. అవన్నీ నేను చదవలేదు. ఏమిటి రాయడం? ఎలా రాయడం మరి?

అతని సమగ్ర కవితా మాధుర్యాన్ని చర్చిస్తూ వ్యాసం రాయాలంటే నేను చదివిన ఆ రెండు పుస్తకాలే చాలవు. పోనీ ఆ రెండు పుస్తకాలే చదివి, విమర్శవ్యాసం రాయడానికి-తగుదునమ్మా అని పూనుకోవడంలో ఔచిత్యమూ ఉండదు. చందమామ కావాలని పేచీ పెడుతున్న బాలరాముడికి అద్దం యిచ్చిన చందంగా ఉంటుంది!

అందుకే శ్రీ రామలింగంగారికి వెంటనే ఉత్తరం రాశాను: నారాయణ రెడ్డి ప్రచురించిన పుస్తకాలలో మిగిలినవన్నీ పంపించమని కోరుతూ. ఈలోపు గానే సన్మాన సంఘం కార్యదర్శి మళ్ళీ రెండు లేఖలు రాశారు. 8వ తేదీ మధ్యాహ్నంటపాలో రామలింగం గారు విపులంగా రాసిన లేఖ కూడా అందింది. పుస్తకాలు హైదరాబాద్ మార్కెట్‌లో లభించలేదని, విశాలాంధ్ర ప్రచురణాలయం వారి నుంచి రావడం ఆలస్యమవుతుందనీ, తెలిపారు. వారింకా యిలా విచారించారు. "మీరు న్యాయం చేయాలనుకున్న దానికి మేము పుస్తకాలు అందచేయలేక పోతున్నందుకు మీరు మమ్మల్ని మన్నించాలి. కాబట్టి మీ దగ్గరున్న పుస్తకాలనే ఆధారం చేసుకొని జనరల్‌గా ఒకవ్యాసం మాకు దయచేయగలరు. ఇక్కడ కొందరు మిత్రులు మీరు వారి కవిత్వంలో ప్రోగ్రెసివ్ ట్రెండ్స్ గూర్చి వ్రాయాలంటున్నారు. కాని మీకు ఏది వీలుగా ఉంటుందో ఆ సబ్జెక్టు మీద రాయండి." అంటూ ఎంతో గౌరవంగా ఒక సుహృదాజ్ఞ జారీ చేశారు.

నిజానికి వారంతగా అభ్యర్థించ నక్కరలేదు. ముఖ్యంగా నారాయణరెడ్డి వంటి ఆత్మీయుని గురించి ఈ చక్కని సందర్భంలో వ్యాసం రాయడం ఒక బాధ్యత కాని ఎంత దురదృష్టం! ఏమి రాయాలన్నా గ్రంథాలన్నీ చదవకపోతే ఎలా? ఆహా ఓహోలతో ఏదో ఒకటి అష్టామాషీగా వ్రాసి, హుటాహుటిగా పంపేయడం న్యాయం చేయగలదా? పైగా అలాంటి అసమగ్రత నాకు సరిపడని విషయం. పోనీ మిత్రులు సూచించినట్లు సి.నా.రె. కవిత్వంలోని అభ్యుదయాంశ గురించే రాస్తే? అప్పటికే నేను అభినవ శృంగారకవి నారాయణ రెడ్డి అనే ఒక పరిశీలన చేదామనుకున్నాను నిజమేమరి! నారాయణరెడ్డి కవిత్వంలో అనేక పార్శ్వాలున్నాయి. ఏది రాయాలన్నా ముందు పరిశీలన అవసరం కదా?

మనలో కొందరు అతిరథులున్నారు. వారు పుస్తకాలు చదవరు. చూస్తారు. అట్టాలూ, అచ్చూ పరిశీలిస్తారు. గ్రంథపుటలు తిరగేస్తారు. వెంటనే తీర్పు చెప్పేస్తారు. అలాంటి గారడీ నాకు చేతకాదు. నాకు వాంఛనీయమూ కాదు. వారి విషయం కొంచెం ముందుగా తెలిపితే-నేనే పుస్తకాలు తెప్పించుకొని చదివి సమగ్ర పరిశీలనే చేసి ఉండేవాడిని. దాహం వేస్తున్నప్పుడు నూయిత్రవ్వడంలాగుంది నా స్థితి! ఏంచేయగలం? అదొక దురదృష్టం.

ఆనందదాయకమైన ఈశుభ సమయంలో ఏమీ రాయకుండా ఊరుకోవడం కంటె ఏదో ఒకటి రాయడమే అత్యవసరమని నేను ఫీలయ్యాను. రామలింగం గారు తెలిపినట్లు జనరల్‌గానే యిది రాస్తున్నాను అందుకే యిది సి.నా.రె కవిత్వ తత్త్వ పరిశీలన కాదు అభినందన మాత్రమే!

నారాయణరెడ్డి అచ్చమైన కవి, ఈ మాట ఇదివరకే మనవి చేశాను. అన్నంతలో సన్మాన సమయోచితంగా అతన్ని మహాకవి అని ప్రస్తుతిస్తున్నానేమోనని ఎవరూ అనుమానించనక్కరలేదు. శ్రీశ్రీ తరువాత వచ్చిన అత్యాధునిక కవులెవరిలోనూ ఇంకా

మహాకవులు రాలేదు. ప్రముఖకవులు మాత్రమే ఉన్నారు. నేను ప్రముఖకవులుగా పరిగణించే ఎల్ల వారికీ తమ తమ సొంతగొంతులున్నాయి. స్వకీయ సంవిధానాలున్నాయి. బాణీలూ ఉన్నాయి. రసావిష్కారవైఖరులూ ఉన్నాయి. వ్యక్తిగత ముఖవర్చస్సులూ విలాసాలూ, ఆలోచనారీతులూ ఉన్నాయి. ఆధునిక కవులందరిలోనూ ప్రముఖ వైవిధ్యాలూ ఉన్నాయి. అదే రుచిరమైన సజీవస్వరూపం!

ఇటీవల కొండొక బజారుపత్రికలో ఒక అసమగ్ర పరిశీలకుడు-ఆధునిక కవిత్వంపై వ్యాసం రాశాడు. ఆధునిక కవులంతా ఒక్కలాగే వ్రాస్తున్నారని కూశాడు. అలాంటి కువిమర్శకులకు పని పట్టుకొని జవాబు చెప్పవలసిన పనిలేదు. కాని చిత్రం! అలాంటి అపభ్రంశపుటాలోచనలు విజ్ఞుల మనుకొనేవారికే కొందరికున్నాయి. ఈ విమర్శచూడగానే నాకోసంగతి జ్ఞాపకం వచ్చింది.

ఏదో కారులోనో బస్సులోనో ప్రయాణం చేస్తున్నామనకుందాం. ఒక మేకలమంద అడ్డమొస్తుంది. వాటి యజమాని జాగ్రత్తగా తప్పించుకుంటూ తోలుకుపోతాడు. అలాచూస్తున్న మనకో ఆలోచనకలుగుతుంది 'ఈ మేకలన్నీ ఒక్కలాగే ఉన్నాయికదా, ఏదైనా తప్పిపోతే, వాడికెలా ఆనవాలు తెలుస్తుంది?' అని. దూరంనుంచి చూసే మనకి అన్ని మేకలూ ఒక్కలాగే ఉన్నట్లు కనిపిస్తాయి. నిత్యపరిచయమూ సన్నిహిత పరిశీలనా ఉన్న అతడికి మాత్రం మేకకీమేకకీ ఎంతో వైవిధ్యం గుర్తుంటుంది. స్థూలదృష్టితో కవిత్వాన్ని చూసే వాళ్ళు-దాని గురించి మాట్లాడకుండా ఉండటమే ఆత్మరక్షణోపాయం!

సి.నా.రె. కవిత్వంలో ఒక ప్రత్యేక వ్యక్తిత్వం ఉంది. ఒక లాలిత్యమూ ఉంది. ఒక విశిష్ట రసవ్యంజనారీతి ఉంది. ఒక శబ్ద విన్యాస వైఖరీ ఉంది. శైలీవైవిధ్యమూ ఉంది. కనుకనే సి.నా.రె. ఒక విశిష్టకవిగా రూపొందుతున్నాడు. ఆధునికకవులలో ఒకరు కరుణరస వాదులు, వేరొకరు బీభత్సరస ప్రధానులు, మరొకరు వీరరస ప్రవీణులు, ఇంకొకరు చమత్కార ప్రియులు. ఇలా నేటి కవితా సమగ్రస్వరూపం ఒక జ్యోతిర్మండలం.

కవులకు సాధారణంగా కొని ఇన్హిబిషన్సు అవరోధాలుగా ఉంటాయి. 'ఈ అల్పమైన కవితనో, భావాన్నో మనపేర బయటపెట్టడమేనా?' అనే యిన్హిబిషను సాధారణంగా కలుగుతూ ఉంటుంది. అలాగే కొన్ని పదాలు ప్రయోగించడానికీ వెరపు కలుగుతుంది. సమదర్శనం గల కవికి ఈ అవరోధం బొత్తిగా పనికిరాని దుర్గుణం. ఈ దుర్గుణం సి నా. రె.కి దరి చేరదు. అతని కవితాత్మకు ధైర్యం హెచ్చు. స్థిర చిత్తంతో ప్రతి కవితా కవిత్వమే అనుకోగలుగుతాడు. ఈ సుగుణం అరుదైనదే!

కన్నడం నుంచి తెచ్చి తెలుగు పద్యాన్ని కొత్త మేకు బందీలతో నన్నయ్య ఏనాడు నెలకొల్పాడో గాని అప్పటి నుంచీ తెలుగులో పద్యాలు రాయగల వారు అనంత కోటిగా ఆవిర్భవించారు. మన కాలంలోనే అసంఖ్యాకంగా ఉన్నారు. ఈ శతాబ్దంలో స్వతంత్రేచ్ఛ మోసులు వారిన తర్వాత గేయాలు రాయగలవారు కూడా ఎందరో రూపొందారు. పద్యం వ్రాయగల ప్రతివాడూ కవికానట్లే-గేయాలు రాయగల ప్రతివాడూ కవికాడు. సి.నా.రె. పద్యం రాసినా గేయం పాడినా అచ్చమైన కవిత్వమే రచిస్తాడు.

సమగ్ర పరిశీలనగా కాకపోయినా, స్థాలీ పులాకంగానైనా సి.నా.రె. కవితలను పరామర్శించకపోతే ఎంత చెప్పినా ఈ వ్యాసానికి పుష్టి చేకూరదు అతని కవిత్వం "హార్ద వేదనా గాన తరంగ శీకర వికస్వర కావ్యధార"నే ఆంతరికలక్షణంగా రూపొందించుకొన్నది "పైకి నవ్వు ప్రసరించి, విషమ్ములు దాచు దొంగ నాగన్నల గుండియల్ చెదరగా కవితాధ్వజ" మెత్తడం

అలవోకగానే సాధించగలిగింది. సంప్రదాయ జన్యమైన కవితా కల్పనలెన్నో ఉన్నప్పటికీ, అపూర్వ భావనా భాస్వద్రేఖలు సి.నా.రె. కవితల నిండా ప్రస్ఫుట మవుతాయి " గాఢ నైరాశ్యములు గడ్డ కట్టినట్లు పేద గుండెల మధురాశ పిదిలినట్లు-కారు మబ్బులు పేలిన గగన వార్ధి బంగరుతటిత్తరంగాలు పొంగులెత్తె!' అంటూ చిన్న తేటగీతిలో ఆకాశమంత బొమ్మను చిత్రించడం ఒక అపూర్వ విలాసం. గడ్డ కట్టి అనే క్రియద్వారా రూపకాన్ని సాధించడం, ఒక ఏబ్‌స్ట్రాక్ట్ మానసిక స్థితిని కాంక్రిటైజ్ చేసి మూర్తి కట్టడం ఆధునిక కావ్యధారానిహితం. గాఢమైన నిరాశలతో ఘనీభవించింది పేదగుండె. కారు మబ్బులు పేరుకొన్న గగన తలం ఒక వార్ధిలా కనిపిస్తోంది. ఆవార్ధి పేదవాని గుండెలాగుంది. పైగా అది గంభీరముద్ర దాల్చింది. ఆ విషాదగంభీరసాగరంలో సైతం ఆశాశంపాలతలు తరంగితమవుతున్నాయి. మాటిమాటికీ బ్రతుకుటాశల వెలార్చుతున్నాయి. వార్ధిలోని ఊర్మికోన్మీలనం వలె కవికి ఆశాతటిత్తులు భాసిస్తున్నాయి. ఇది ఒక అనవద్యసుందరమైన అపూర్వకల్పన ఇలాంటి తావులే-మామూలు రచయితను సైతం-రసవత్ కవిగా నిలుపుతుంటాయి.

"కెరలు వాసంతి నిప్పు చెక్కి ఘృతాకి
తీయని మరంద శిల్పాలు తీర్చినారు
కడలు హేమంత కన్యను కౌగలించి
వెచ్చనిపదాలు పైకి రప్పించినారు!''

ప్రకృతిసంబంధమైన అనుభూతిని కవితానుభవంగా పరివర్తింపచేయడం పైపద్యంలో హృద్యంగా ఆవిష్కృతమైంది. నిర్గుణానుభవాన్ని సగుణ పదచిత్రం ద్వారా మూర్తిమంతం చేశాడు కవి. ఇలాంటికవితా గుణాలు ఎన్నోపద్యాలలో కనిపిస్తాయి. ఉదాహరణకు "ఒలికిపోయిన మధుమధురోహలెల్ల జారె, దివినుండి దిగజారు తారలట్లు పెకలివచ్చెడు భావవీచికలు చెదరె గాలితాకిన శరదంబుదాల లీల!' ఇంత హృద్యంగా సాగిన ఈ పద్యంలో అదృశ్యమైన కేవల అమూర్తానుభూతిగా మిగలవలసిన, మధుమధురోహలు ఒక ద్రవ పదార్థంగా జారుతున్నాయి. దృశ్యమానమైన తారకా పతనంతో ఆ జారడం ఉపమితమైంది. హృదయంలో క్రమ్ముతున్న భావవీచికలు, శరత్కాలమేఘాలు గాలి తాకిళ్ళకు చెల్లాచెదరైన రీతిగా చెదరిపోతున్నాయి. అంటూ కవి అనుభూతిని అనుభవంగా పరివర్తింపచేసి చిత్రించాడు.

"ఈ దిగంతాల చైత్రరాజోదయాన సిగ్గుపడనేర్చె చిన్నారి చివురుచాన! ఆ వనాంతాల మధుమన్మథాగమాన నవ్వుకొననేర్చె పొన్నారి పువ్వుజాణ!' అదీ పద్యం-ఎంత సొగసులూరుతోందో! చైత్రోదయమైంది. చిన్నారిచిగురులు సిగ్గులొలకపోస్తూ. కొమ్మపట్టులనుంచి రవంత పైకివచ్చి చూస్తున్నాయి. వనాలలో మన్మథుడు ప్రవేశిస్తున్నాడు. పువ్వునెరజాణలు యౌవనోల్బణంతో నవ్వులొలికిస్తున్నాయి. సాధారణ వసంతాగమన చిత్రణలో ప్రతికవీ చివురుల గురించీ పూవుల గురించీ చెప్పకతప్పదు. ఆ చెప్పడం ఇక్కడ ఎలా జరిగింది. మామూలు చిగుళ్లూ పూలూ నెరజాణలై శృంగారవతులుగా నిలచాయి. అతి సాధారణ భావాన్ని అసాధారణ కవితాస్వరూపంగా మలచి, ఉక్తివైచిత్రిని దోహదంచేసి మనోజ్ఞచిత్రం అందించాడు కవి. తేటగీతి నాలుగుపదాలకూ అంత్యప్రాస సమకూర్చబడింది. ఇక్కడ దిగంతాలూ అక్కడ వనాంతాలూ సమశ్రుతిలో పెనగడం ద్వారా నీరంధ్ర మనోహర చిత్రం సాధింపబడింది. సిగ్గుపడటమూ, ముసిముసిగా నవ్వుకోవడమూ నవయౌవనవతుల లక్షణం. దాన్ని ప్రతిపాదించడంలో ప్రకృతి సమగ్రంగా శృంగారభావావిష్టమైందన్న ధ్వని అభివ్యక్తమైంది. చిన్నారి చివురుచాన, పొన్నారి పువుజాణలనే తెలుగుపలుకుబడులద్వారా ఆత్మీయత ఆయత్తమైంది. పొన్నారి అనేపదం పసిడి అనే అర్థంలో వాడబడటం తెలుగులోగిళ్ళ మర్యాద!

"మావిపూవు మోవికావిలో తావిలో తలపువన్నె సోన చిలుకరింత - తేటిమేటి తేటపాటలో బాటలో మేలి బ్రతుకు పాట మేళవింత!' అటవెలది కాలయందెల రవళి ఎంతకమనీయంగా కలధ్వనులీనుతోందో! సొగసుగా గుండెల్లో చిందులాడుతోంది. కవి హార్దిక కామన వ్యక్తం చేయడంలో మాధుర్యగుణాన్ని, అనుభవలాలసనీ రంగరించి నిక్షిప్తం చేస్తున్నాడు. తానా కవి, మన్మథునివంటివాడు ప్రకృతి పూవులతో పరవశించిపోతోంది. మావిపూవు పెదవులు కావిరంగులీనుతున్నాయి. పరిమళాలు వెదజల్లుతున్నాయి. వాటిపై తానుతలపుల వన్నెలసోనలు చిలుకరిస్తాడు. అంతే, ఆ పూలపెదవులు ముద్దు గొంటాననడు. తేటులు పాటలతో బాటలు నిర్మిస్తున్నాయి. ఆ బాటలు మేటిగానూ, తేటగానూ ఉన్నాయి. ఆ పాటల శ్రుతితో తాను కవిగా బ్రతుకుపాటనే మేళవిస్తానంటాడు! ఈ విధంగా ప్రాకృతిక నిసర్గసౌందర్యాలను కవితాసౌందర్యానుభవాలుగా మలచుకొంటాడు కవి.

సి.నా.రె. కవిత్వంలో మానవతావాదం సంపూర్ణ స్వరూపంతో నిష్యందమవుతుంది. అనేక అభ్యుదయ కవితాభావనలూ, శ్రామికజన మమేకత్వాలూ సాక్షాత్కరిస్తుంటాయి. జీవిత వాస్తవికతాచిత్రణ అతిశయిల్లుతూ, పాఠకహృదయాన్ని ఆపుతూంటుంది. ఒక ఉదాహరణ పరిశీలిద్దాం. "మ్రగ్గిన గతానకీనాడె అగ్గిపెట్టి గతుకబడిన మతాలకు చితిరగిల్చి సామ్యజీవన సాధనాశయము దేర్ప కట్టుకొండీ ఉగాదిని కంకణాలు!' అంటూ కవి ప్రతిపాదించే ప్రగతిశీల భావన విశ్వజనీనమై భాసిస్తోంది పైగా-'సామ్యజీవన సాధనాశయము దీర్ప ఉగాదికి కంకణాలు కట్టుకోమని ప్రబోధించడంలో కవితావేశం పెల్లుబికింది. ఈ పద్యనేపథ్యంలోంచి ఎందుకో రాయప్రోలు లీలగా కనిపిస్తాడు.

ఈ 'జలపాతం' కావ్యసంపుటి 1954 లో ప్రచురింపబడింది. కవి మిత్రుడు ప్రచురణకర్త శ్రీ యం. బలరామాచార్యులు నాకు జనవరి ఒకటో తేదీని పంపాడు. 'దాశరథి'కి అంకితం చేయబడింది. కవికి ఇరవై అయిదు వసంతాల మనోహర ప్రాయం. తిరిగి ఎన్నడూ అందని అందమైనరోజులవి! ఆ వయస్సులోని కవితావేశమే సహజ సుందరమైనది. తదువాతి కాలాలది కొంతకావాలని సమకూర్చుకొనేదే! కేవల సృజనావేశమే ప్రధానభూమిక వహిస్తుంది పైలా పచ్చీసులో! ఎగబ్రాకుతూపోయే యౌవనావిర్భావనిర్భర పూర్ణత్వంలో ఔచిత్యవిచారణ గౌణమైపోతుంది. అందువల్లనే-'మల్లెమొగ్గలపైన ఫెటిల్లుమనుచు రాలె వడగళ్ళు-తరుణీకుచాలు నొవ్వపూవువిలుకాడు బాణాలు రువ్వినట్లు!' వంటి పాదాలు 'పరస్థలాలు'గా తొలగించబడలేదు. నవ్యకవులుగా ప్రఖ్యాతికెక్కిన భావకవులు గాని, తదనంతరవికసితులు శ్రీశ్రీ ప్రభృతి ఆధునిక కవులుగాని, ఎవ్వరూ తరుణీకుచాలను కవిత్వంలో స్పర్శించలేదు. ప్రబంధకవుల శృంగారోపకరణాలకు పునఃప్రవేశం ఇన్నాళ్ళకు లభించడం చింత్యమే!

ఊష్మతీవ్రతచేత పెల్లుడికి పోతున్నాయి మల్లెలు. ఆ సమయంలో పెటిల్లుమంటూ వడగళ్ళు రాలాయట పాపం! వడగళ్ళ దెబ్బలుతిన్న మల్లెలు నవాశలకోల్పోయి వాడివత్తలవుతున్న దయనీయావస్థ! అలాంటి స్థితిని మనోజవిలాసంతో ఉపమించడం! పువ్వు విలుకాడు బాణాలురువ్వినట్లుగా వడగళ్ళు దెబ్బతీస్తున్నాయనడంలోని ఔచిత్యం విచార్యమే. లేనిపోని పువ్వువిలుకాడు ప్రయోగించే లేనిపోని బాణాలు వడగళ్ళ దెబ్బల్లా మీదపడితే ఈ సుమశరునిజోలికి తరుణులు కాదుకదా బాహాబలాఢ్యులైన కవులుకూడా పోరు!

అలాగే మరో పద్యంకూడా పరిశీలించవలసిందిగా వుంది "భిన్న మార్గాల పయనించుచున్న జనుల ఏక వేదిక పైకి రప్పించినట్లు-విడి విడిగ జారు క్రొంగురుల్ ముడిచి మడచి జడగనల్లితివో కాలసర్ప వేణి!" భిన్నవిభిన్నాభిప్రాయాలను ఏక వేదికపైకి రప్పించటం కవికి వాంఛనీయమే. తద్వారా జాతికి

శుభోదయం చేకూరుతుందన్న విశ్వాసమూ సమంజసమే. కాని అట్టి ఐక్యం కాళసర్ప సదృశంగా భయంకరమైనదైతే? ఉపమారూపకాదులలో నవ్యత సాధిద్దామన్న ఆతురత బాల్యచాపల్యాన్ని సంయమింప చేసుకోలేకపోతుంది.

'బ్రతుకు లోయలు' అనే ఖండికలో—"సమతా పాఠం నేర్చుకోవాలంటే శ్మశానమే సహజకావ్యం సుమా'? అనే సూక్తి మరీ ఆశ్చర్యం కలిగిస్తుంది. మన మంతా వాంఛించేది శ్మశాన సదృశమైన సమత్వం కానేకాదు, ప్రఖ్యాత ఆంగ్లకావ్యం-'డెత్ ది లెవెలర్' అనేది హైస్కూలు స్థాయిలో పాఠ్యభాగంగా నిర్ణయమవుతూ ఉండేది. అందలి కొత్త ఆలోచనా రీతి శ్మశాన సమతాత్మధర్మమూ, మృత్యువు అనివార్య శక్తి-యువహృదయాలను ఆవేశపరచేది. మనం కోరేది జనన మరణాల మధ్యనున్న యీ సుందర జీవితంలో సాధించవలసిన సమధర్మాన్ని మాత్రమే. పేదలూ, ధనికులూ, పీడితులూ పీడకులూ అనే విభేద రహిత సమానత్వం! కవి ఆలోచన అశాస్త్రీయ సమానత్వం దిశగా పయనించినపుడు తప్పితే మరణానంతర శ్మశానస్థ సమానత్వం వాంఛనీయం కాబోదు.

శోధన అనే గేయంలో-"సినదిస్తున్న వినోదవీణా తంత్రుల్ని బిగిస్తున్నా!... పుటుక్కున తెగి కటు స్వరాలు మ్రోయాలని!" - అనడం కూడా ఔచితీ భంగమే! అలాంటిదే విశ్వగీతలోనూ కనిపిస్తుంది. భవిష్యత్ మానవ మహోదయం గురించి ఇలా భావిస్తాడు కవి. "ప్రణయానికీ ప్రళయానికీ వంతెనలను నిర్మించాలి. మృత్యుజీవితాలకు సాహిత్య పరిధి కల్పించాలి!" అనడం సార్థకమైన ఆలోచన కాదు. ఏమైనా పైన పేర్కొన్న కవితలన్నీ 1954కు పూర్వం రచింపబడ్డవే! కవిలోని తడి ఆరని బాల్యాం కవిచేష్టలుగా మనం విస్మరించాలి. మరింత సానుభూతితో, లాలనతో కవి హృదయాన్ని స్పర్శించాలి.

ఐనా దోసగులనే వెదకాలంటే నన్నయ్య నుంచి నా వరకూ ఎక్కడైనా సందులు దొరుకుతాయి.

శ్రీ నారాయణరెడ్డి కవితలలోని ప్రధాన జీవన ధాతువు శృంగారమని ముందే మనవి చేశాను. నా అభిప్రాయాన్ని వివరించవలసి వుందనుకుంటాను. భౌతిక వ్యక్తిత్వానికుండే ప్రత్యేకలక్షణాలవలెనే-కవి హృదయాలకు కూడా వైయక్తిక లక్షణాలుంటాయి. ఈ కవిలో శృంగార రసధాతువు జీవలక్షణంగా భాసించింది. ఆరంభరచనల నుంచీ ఈ లక్షణం విస్పష్టమవుతూనే వుంది.

"కమల కన్యను మోసాన కన్నుగప్పి
కౌగలించిన తుమ్మెద గడుసురేడు
కర్మసాక్షి అంగారాక్షి గాంచినంత
జారిపోయె! తమిస్రపు జాడలందు!"

(ఉదయధ్వజం)

... ... ...

"ఊష్మనిశ్వాసముల క్రాగుతున్న భూవి
రహిణి పాండుర వక్షోంతరమ్మునందు
గ్రాసపులకాంకురమ్ములు మోసులెత్తె
రమ్యవర్షాధిపతి పరీరంభణమున!"

(వర్షావతరణం)

"మొరటు ఎండల గ్రీష్మనుముద్దువెట్టి
భగ్గుమనెడు లేమొగ్గల బుగ్గలందు
అమృతనిష్యంది నవజీవనౌషధమ్ము
రంగరించెను సరస వర్షాభిషక్కు!'-(వర్షావతరణం)

... ... ... ...

'గుండెపైభారమట్లు కూర్చుండి నట్టి
పయ్యెద విదల్చి, జిలుగుదుప్పటినదల్చి
ముసురుకొనివచ్చు స్వప్నాల ముసుగులోన
వెచ్చగా నిశ్వసించినావే లతాంగి;' - (సుప్త సుందరి)

"ఎంత స్వేచ్ఛగానెదుగు సిద్ధాంతమైన
నియమసూత్రమ్ములోన సంధించినట్లు
క్రమ్ముకొనివచ్చు తీక్ష్ణ వక్షోజయగము
బిగువుచోళమ్ములోన జొప్పించినావు! (సామ్య
రూపిణి)

వంటి అసంఖ్యాక పద్యాలకు రమ్యతనూ, సౌంద ర్యగుణాభిరతినీ కలిగించే జీవనధాతువు లలితమైన శృంగారమేనన్నది యథార్థమే! శృంగారభావమే అంగిగా అలరడం యిటీవలికృతులలో (1958) మరింతగా పెంపొందింది. ఇది ముఖ్యకృతివలె పరిహరించలేనిగుణమే! ఐనా, శృంగారరసం మనసాహిత్యం నిండా పెచ్చుపెరిగి, ఈయుగానికి తలబరువయ్యే ప్రమాదకారిగా రూపొందడంవల్ల యిలా ఎత్తి చూపుకోవలసి వచ్చిందేకాని, పైన ఉదహరించిన పద్యాలు మనోహరమైన వనడంలో సందేహం లేదు!

ఈ సత్యమే యీకవికి సుబోధకమైంది. కనుకనే మరోకవితలో ఆయనే యిలా అంటాడు. "ప్రపంచ దిశాకుహర కుడ్యాల్లో-ప్రళయ హేషాఘోషలు! ప్రతి రణిస్తున్నప్పుడు-విరహ ప్ర-బంధాలముళ్ళు-విప్పుతూ కూర్చోలేం!" (ప్రస్తావనరానేరాదు!)

లోకయథార్థతతోబాటు, సామాజిక వాస్తవికతను సైతం ఆధునిక వివేచనతో అవగాహన చేసుకోవడం కవిగా ఆరంభించిన దశకు సూచనగా మనం పైకవితను గ్రహించవచ్చు. ఈ క్రింది పాదాలలో ఆయన దర్శనం మరింత నైశిత్యమల వర్చుకుంది. "లోకాన్ని అనుదినం-చీకాకు పరుస్తున్న-ఆకలిబాకాల ఆర్భటిలో -ప్రేమ పురాణశ్రవణం-ఏమో? సాధ్యమవుతుందా?" (ఖరీదు తగ్గిన ప్రేమ) అప్పటికేకాదు-ఇప్పటికీ ఈ ప్రశ్న సినీ నిర్మాత ప్రభువులకు కలగనేలేదు. తళతళలాడించే సినీ కవిత్వాన్ని సాధించాలని అంగలార్చిన కవులకు ప్రేమపురాణకర్తృత్వం బలవంతంగా రుద్దబడుతూనే ఉంది. (నేనీ మాటలురాసినది 1958లో అని మరువ కూడదు.)

మానవ జీవితం సంకీర్ణమైనది. బహుముఖీనమైనదీను. అట్టి జీవితానికి శృంగారంగాని, ప్రేమగాని, విరహం గాని, ఆకలిగాని, ఆవేశంగాని, విప్లవంకాని, బీభత్సంకాని-ఏదీ వెలివేయవలసినది కాదు. అందని మ్రాని పండూకాదు. అస్పృశ్యంగా దూరీకరించవలసిందీ కాదు. దురదృష్టవశాత్తూ మన సాహిత్యం కొన్ని వందల ఏళ్ళుగా శృంగార రసాయనం తప్ప అన్యమేమీ తనకు పడదని భీష్మించుకు కూర్చుంది. అందుకే వైశాల్యం కోల్పోయి కుంచుకుపోయింది. పాడిందే పాటగా సాగిపోయింది. శృంగారం పెరిగి పెరిగి దుర్గంధ భూయిష్ఠమైపోయింది. అందుకే ఆధునిక కాలానికి అది వెగటుగా మారి విసర్జనీయమైపోయింది. అంతే తప్ప-అది శృంగారం చేసిన పాపంకాదు. పైగా ఏ కాలంలోగాని, ఎవరుగాని జీవితంలో ప్రధానమైన శృంగారాన్ని విసర్జించి బ్రతకడమూ సాధ్యం కాదు.

ఆధునిక జీవితం పూర్వమెన్నడూ ఎరుగనంత విచక్షణాజ్ఞానాన్ని అలవర్చుకుంది. వివేక జ్యోతులు వెలార్చుకుంది. అన్ని కోణాలనుంచీ స్పష్టంగా తర్కించుకోగలుగుతోంది. కనుకనే ఏ విషయంలో గాని, హేతువాద అభాసను సహించలేక పోతోంది. ఎంతమధుర రసమైనా శృంగారమే ఆహారంగా స్వీకరించలేము కదా?

కవిగా శ్రీ నారాయణరెడ్డి నిరంతరాభ్యుదయ శీలి. నిరంతర యౌవనహృదయంతో నిత్యపచ్చగా పురోగమించేకవి నారాయణరెడ్డి. కవితావ్యవసాయంలో యిప్పటికే అతడెంతో సాధించాడు మరెంతో సాధించవలసివుంది. అందుకే యీ శుభతరుణంలో ఆయనికి నేనాత్మీయంగా అభినందన అందిస్తున్నాను.

కవికి ప్రతిభావ్యుత్పత్తులతోపాటు-పరిస్థితుల సానుకూలతకూడా సమకూడాలి. ఈ అదృష్టం అందరికీ లభ్యమయ్యేదికాదు. శ్రీ నారాయణరెడ్డి అలాంటి కొద్ది

మంది అదృష్టవంతుల్లో ఒకడు! అదికూడా నాకెంతో ముదావహమైన సంగతే!

నిజంగా చెప్పాలంటే కవితాసాధన అసిధారా వ్రతమే. ఆ వ్రతంలో అవలీలగా విజయం సాధించ గలవారెందరో ఉండరు. అలాంటి అరుదైన విజయో పేతులలో శ్రీ నారాయణరెడ్డి ఒకడు కావడం నాకెంతో ఆనందకర సన్నివేశమే!

(1958 డిసెంబరు నెల చివరిలో ప్రవాసి సన్మాన సంఘం వారికి పంపిన యీ వ్యాసం ఎందువలనో ప్రచురితం కాలేదు. కాగితాలు కట్టల కట్టలుగా పెరిగి పోతూంటే యిటీవల పరిష్కరించ పూనుకొన్నపుడు యీ వ్యాసం చిత్తు ప్రతి బయటపడింది. దానిని కొద్ది మార్పులతో శుద్ధప్రతి రాయగా కలిగిన ఫలితమిది– రచయిత)

కాకేశినికేతన్
పిఠాపురం
533 450 ఏ.పి.

# భారతమాతా! జయోస్తు

ఐతా చంద్రయ్య

అవని నేలిన భువన మోహిని
విమల హృదయిని మధుర గాయిని
మంజు భాషిణి, మందహాసిని
మాత నీవె సుమా!

హిమన్నగమే రత్న మకుటము
హిందు సంద్రము పాదపీఠము
గంగ, గోదా, యమున చిందులతో
విందు చేసితివే!

సిరులు పొంగగ సురలు పొగడగ
సమర సామ్రాట్టులను గంటివి
అసుర జాతిని తరిమి కొట్టిన
చరితమమరములే!

వేదగానము, నాదస్వర ఝరి
వేద మూర్తుల జ్ఞాన బోధలు,
ఉపనిషత్తుల నీతి ధారలు
నిత్య కృత్యములే!

కండ కరిగిన కార్మికునికి
గుండె చెదరిన కర్షకునికి
దండి విబుధుడు దార్మికునికి
అండ నిలువమ్మా!

అన్న పూర్ణవు, ఆది శక్తివి
ఆద మరచిన చోద్యమమ్మా!
అన్నదమ్ముల కైక్యతా మం
త్రమ్ము నివ్వమ్మా!

# తెలుగులోని హిందూస్తానీ పదాలు-ధ్వనిమార్పులు

— డా॥ పి. కుసుమ కుమారి

ఎప్పుడో భూతలం మీద నివసించి ఈనాడు నశించిన జంతు జాతుల లక్షణాలను తెలుసుకునేందుకు వాటి ప్రాచీన అవశేషాలు (fossils) ఆధారాలవుతాయి. ఆ విధంగానే ఏనాడో భిన్న మానవ జాతుల మధ్య ఏర్పడిన సంబంధాలను పరిశీలించేందుకు భాష ఒక ప్రాచీన అవశేషంలాగ తోడ్పడుతుంది. Langvage has been Characterised as fossile poetry images, the imagination and feelings of past ages are preserved in words[1] అన్న ఫ్రెంచ్ అభిప్రాయం భాషలు మానవ సంబంధాలకు, సంస్కృతికి భద్రపేటికలని నొక్కి చెపుతున్నది. భిన్నభాషా వ్యవహర్తల మధ్య వ్యవహార సంబంధాలేర్పడినప్పుడు వారి మధ్య భాషాదానం Langege proorowing) తప్పని సరి.

ఒక భాష తన మౌలిక సంప్రదాయానికి లేదా నిర్మాణానికి భిన్నమైన అన్యభాషా లక్షణాలను ఇముడ్చుకోవడమే భాషల్లో ఆదానం. ఆ భాషయొక్క చారిత్రక క్రమంలో ఏదో ఒక దశలో అన్యభాషల నుంచి వచ్చిన పదజాలం ఆదాన పదజాలం (Borrwbed Vocabolary) అనబడుతుంది. భాషల మధ్య జరిగే ఈ ఆదానానికి ద్విభాషావ్యవహర్తలు (Bilingvabs) మూలం. రెండు లేక అంతకంటే ఎక్కువ భాషలను ఒకటి విడిచి ఒకటి మాట్లాడ గలిగిన వ్యక్తిని ద్విభాషా భాషి (Bilingval) అనవచ్చు. క్రొత్త భాషను త్వరితంగా నేర్చుకోగలిగిన సహజ సామర్థ్యం, సంసిద్ధత, రెండు భాషలను తడుముకోకుండా మారుస్తూ మాట్లాడ గలిగిన బుద్ధి కుశలత (Switching fawlity) అనేవి ద్విభాషా వ్యవహర్తలో ఉండే ప్రత్యేక లక్షణాలు.

తెలుగుభాషా చరిత్రను ఒకసారి సింహావలోకనం చేస్తే నాటి సంస్కృత ప్రాకృతాలు మొదలుకొని, నేటి ఇంగ్లీషువరకు ఎన్నో భాషలు ఆ భాషపై తమప్రభావం చూపినట్లు తెలుస్తుంది. ఆయా భాషలనుంచి వచ్చి చేరిన నూతన పదజాలం తెలుగుభాషను మరింత సుసంపన్నం చేసింది. ప్రయోగ బాహుళ్యాన్ని సమకూర్చింది. ఆ విధంగా తెలుగులో చేరిన అన్యభాషా పదాలలో హిందూస్థానీ భాషకొక ప్రత్యేక స్థానమున్నది. ఇంగ్లీషు ప్రభావం అత్యధికంగా ఉన్న ఈనాడుకూడా పరిపాలన, న్యాయ విభాగాల్లో హిందూస్థానీ పదాలే ఉపయోగించబడుతూ ఉండడం, ఆయా రంగాలపై హిందూస్థానీ భాషకున్న ఆధిపత్యాన్ని తెలియజేస్తున్నది.

భాషలో ఆదానం మొదట వ్యక్తి మాండలికాన్ని (idiolact) తరువాత మాండలికాన్ని, చివరగా మొత్తం భాషనూ ప్రభావితం చేస్తుంది. వ్యక్తి మాండలికంలో ప్రాథమికమైనది ధ్వని పరిణామం. క్రొత్త భాషలోని ధ్వనులను స్వభాషా ధ్వనినియమాలకు అనుగుణంగా మార్చుకునే ప్రయత్నమే ఈ పరిణామానికి మూలకారణం. తత్ఫలితంగా భాషలమధ్య ఉచ్చారణాదానం (Pronunciation borrowing) కూడ జరిగే అవకాశం ఎక్కువ. "if a speaker

initates some one elsis prononciation of a word whith is aheady fauin warto the borrowev we may speak of pronan ciation borrowing"[2] అని హాకెట్ నిర్వచనం. ఈ విధమైన ఉచ్చారణాదాన ఫలితంగా తెలుగులో ప్రవేశించిన హిందూస్థానీ ధ్వనులు వివిధరకాల మార్పులకు లోనైనాయి.

తెలుగులోని హిందూస్థానీ పదాల్లో కనిపించే ధ్వని మార్పులను సౌలభ్యం కోసం ఈ క్రింద సూచించిన విధంగా వర్గీకరించుకోవచ్చు.

*1. గుణభేదం* (Change of Quality)

ఇది రెండు విధాలు

అ) సంవృతాచ్చులు వివృతాచ్చులుగా మారడం

| హిం | తె |
|---|---|
| ఉదా॥ దూఅలీ > | దవ్వాల్ (ఊ-> -అ-) |
| దేవాఢీ > | దేవడి (ఊ-ఐ-> -అ-) |
| పావాతీ > | పావతి (-ఐ-> అ-) |
| జుగ్నీ > | జిగినీ (-ఉ-> ఇ-) |

ఆ) వివృతాచ్చులు సంవృతాచ్చులుగా మారడం

| హిం | తె |
|---|---|
| ఉదా॥ అష్రఫీ > | అషరుఫీ (-అ-> -ఉ-) |
| కసీదహ్ — | కసూది (-ఈ-—ఊ) |
| జేబ్ — | జోబి (-ఏ — ఒ-) |
| పైగ ష్ — | పైగస్తు (-ఈ — ఉ-) |
| ముసాఫిర్ — | ముసాఫురు (-ఇ — ఉ-) |

*2) శ్వాసత-నాదత* Un - Voicing- Voicing)

ఇది రెండు విధాలు.

అ) శ్వాసత - (Un Voicing) నాదస్పర్శాలు శ్వాస-స్పర్శాలుగా మారడం.

| హిం | తె |
|---|---|
| ఉదా ׀ టాంగన్ — | టాంకణ (-గ—క-) |
| దుతార — | తుతార (ద—త-) |
| బున్యాద్ — | పునాద (బ—ప-) |

ఆ) నాదత (Voicing) శ్వాసస్పర్శాలు నాద స్పర్శాలుగా మారడం.

| హిం | తె |
|---|---|
| ఉదా : కాఫరీ > | గాఫర (క- > గ-) |
| పప్రా > | బొబ్బర (ప- > బ-) |
| ఖజాంచీ > | ఖజాంజీ (-చ > -జ) |

*3) అల్పప్రాణ మహాప్రాణ భేదం;ఇవి రెండువిధాలు*

అ) అల్పప్రాణం మహాప్రాణంగా మారడం : (Aspiration)

| హిం | తె |
|---|---|
| ఉదా : కాహిలా > | ఖాయిలా (క- > ఖ-) |
| చప్రాసీ > | ఛప్రాసీ (చ- > ఛ-) |
| జుబ్బా > | ఝబ్బా (జ- > ఝ-) |
| బేగమ్ > | భేగమ్ (బ- > భ-) |

ఆ) మహాప్రాణం అల్పప్రాణంగా మారడం : (Unaspiration)

| హిం | తె |
|---|---|
| ఉదా : ఖర్కషా > | కరకషా (ఖ- > క-) |
| ఘోడా > | గోడా (ఘ- > గ-) |
| ఛొక్రా > | చొక్రా (ఛ- > చ-) |
| ఝూటా > | జూటా (ఝ- > జ-) |
| బఢావ్ > | బడావు (-ఢ- > డ) |
| భత్తా > | బత్తా (భ- > బ-) |

*4) ద్విత్వ అద్విత్వభేదం : ఇది రెండురకాలు*

అ) ద్విత్వం అద్విత్వంగా మారడం

హిం తె

ఉదా : అత్తారీ > అతారీ (-త్త- > -త-)
తరద్దుద్ > తరదూదు (-ద్ద- > -ద)
నవ్వాబ్ > నవాబు (-వ్వ- > -వ-)
ముహర్రమ్ > మొహరం (-ర్ర- > -ర-)

అ) అద్విత్వం ద్విత్వంగా మారడం:

హిం తె

ఉదా: అతర్ — అత్తరు (-త — త్త-)
నమక్ — నమ్మకు -మ — మ్మ-)
కమీ — కమ్మీ (-మ — మ్మ-)
బూటా — బుట్టా (-ట — ట్ట-)

5 సంయుక్తాక్షర లోపం

హిం తె

ఉదా; ప్యాలా — పెలా
బున్యాద్ — పునాది
సౌట — సోట

6) స్వరభక్తి : Anaptyris అచ్చు చేరడం వలన హల్సంయుక్తం (Cansunant cluster) అసంయుక్తం కావడం.

హిం తె

ఉదా :- ఇక్రార్ — యెకరారు
చిమ్టా — చిమటా
మిహ్నత్ — మెహనతు
ముశ్రూత్ — మషరతు.

7) వర్ణ సమీకరణ (Assimilation)

రెండు భిన్నధ్వనులు ఏకస్థాన జనితములైన వర్ణములుగా మారడం, హల్సంయుక్తం ద్విత్వంగా మారడం అని కూడ ఈ మార్పును పేర్కొనవచ్చు.

హిం తె

ఉదా : గిర్దావరీ — గిద్దావరీ (ర్ద — ద్ద)
దుర్మున్ — దమ్మస్సు (ర్మ — మ్మ)
పర్ద్ — పద్దు (ర్ద్ — ద్ద)
పాద్షా — పాచ్చా (ద్ష — చ్చ)
మస్జిద్ — మజ్జీదు (స్జ — జ్జ)

8) వర్ణవిభేదనం (Dissimilation) ఒకేవర్ణం వెంట వెంట ఉచ్చరింపబడినప్పుడు వాటిలో ఒక వర్ణము మరొక వర్ణంగా మారడం.

హిం తె

ఉదా : టట్టీ > తట్టీ (ట- > త-)
టోటా > తోటా (ట > త-)
ఢంఢోరా > దండోరా (ఢ- > ద-)
మదద్ > మదత్ (-ద > త)
ఖాభీ > ఖాబి (-భ > బ)
మల్ఫూప్ > మల్ఫూబు (-ప్ - బ)

9) వర్ణవ్యత్యయం : పదములోని ధ్వనుల వరుస తారుమారు కావడం. దీనికి వ్యక్తియొక్క ఉచ్చారణ త్వరగాని, అశ్రద్ధగాని, పద స్వరూపంపట్ల సరైన అవగాహన లేకపోవడంగాని కారణం కావచ్చును.

హిం తె

ఉదా : అమానత్ > అనామత్
అసార్ > శివారు
ఉహ్దా > హోదా
మక్బర > మొఖరాబా

10) ధ్వని లేదా అక్షరాగమం (Addition of a sound or syllable అగమంగావచ్చే ధ్వని లేదా అక్షర (syllable) స్థానాన్నిబట్టి ఇదిమూడు విధాలు.

అ) పదాది ధ్వని లేదా అక్షరాగమం(Prothesis)

సేకరించినపదాల్లో పదాది ధ్వనిలేదా వర్ణ అగమం లేదు.

ఆ) పదమధ్య ధ్వనిలేదా అక్షరాగమం (Apen thesis

హిం తె

ఉదా : జానిషాన్ > జాయనిషీన్
జిహాజ్ > జిల్‌హాజ్
ధరూత్ > ధరావత్తు
ధోతి > ధోవతి
పాపోష్ — పాయపచ్చు
జారీ — జ్యారీ
బాగాత్ — బాగాయతీ

ఇ) *పదాంత ధ్వని లేదా వర్ణాగమం*(Epithesis)

హిం తె

ఉదా : అవ్‌రంజ్ — అపరంజి
కారువా < కారువాయి
జుబ్బ > జుబ్బాయి
ఝుగ్‌డా > జగడము
డెరా > దేరాయి
మన్ > మణువు
మరూ > మరువు

*12 ధ్వనిలేదా అక్షరలోపం* (Loss of sound or syllable)

ధ్వని లేదా అక్షరం లోపించే స్థానాన్ని బట్టి ఇది మూడు రకాలు.

అ) *పదాది ధ్వని లేదా అక్షరలోపం* (APihesis)

పదాది ధ్వనిలోపం కేవలం హా॥ లోనే కనబడు తున్నది. 'హ' అచ్చుతో ఉన్నప్పుడు 'హ' లోపించి అచ్చు మిగలడం జరిగింది.

హిం తె

ఉదా : హద్ద్ > అద్దు
హాండా > అండా
హుక్మ్ > వుకుము

ఆ) *పదమధ్య ధ్వనిలోపం* (syn cope)

ఇక్కడ అచ్చులోపం మాత్రమే జరిగింది. ఫలితంగా మూడక్షరాల (Triy syllastor words) పదాలు రెండక్షరాల పదాలు (Disylstar wodrs) గా మారినాయి.

హిం తె

ఉదా : కటియా > కట్యా
ఖందువా > ఖంద్వా
జాబితా > జాప్తా
డోరియా > డోర్యా
తరక్కీ > తర్కీ
బాబత్ > బాప్తు
వారిస్ > వార్సు

మూడు పదాలలో 'హ' లోపించి అచ్చు మిగలటం గమనించవచ్చు.

హిం తె

ఉదా : కాహిలా > కాయిలా
సాహెబా > సాయబు
సిపాహీ > సిపాయి

ఇ) *పదాంత ధ్వనిలోపం* (Apo Cope)

హిం తె

అచ్చులోపం : ఉదా : పేటా > పేట్
నక్కాషి > నకాస్

హిం తె

హల్లులోపం : ఉదా : తప్‌రీక్ > తపరీ
టాసార్ > టాసా
దామాసాహ్ > దామాషా
షాహ్ > షా

*12*) *అనునాసిక్యము* Nasalisation

అ) *అనునాసికాగమం* Addition of Nasal

హిం తె

ఉదా : కురతీ > కుడితిని

దాదర్ > చందర
పాజిబ్ > పాంజెబు

అ) అనునాసికలోపం (Lost of Nacse)

హిం తె

ఉదా : కాంటా > కాటా
కానూన్‌గొ > కానుగొ
కైన్ చీ > కైచి
గోంట్ > గోటు
ఝూంప్‌డా > జోచిడి
పన్‌సారి > పసారి
మంజిల్ > మజిలీ
హాన్‌సలీ > హసలి

*13*) లోపదీర్ఘత : Compersatory length ening పదంలో ఒకధ్వని లోపించినప్పుడు, దానికి పూర్వమున్న అచ్చు దీర్ఘం కావడం.

హిం తె

ఉదా : ఇరాదత్ > ఇరాదా
ఖులాసత్ > ఖులాసా
పెహ్‌రిన్ > పేరిస్తు
మసాలహ్ > మసాలా
సర్‌హంగ్ > సరాంగు.

*14*) సామ్యం (Analogy) మరొకపదం పోలికను బట్టి ఉన్నపదానికి క్రొత్త స్వరూపాన్ని ఏర్పరచడం సామ్యం అనబడుతుంది.

హిందూస్థానీ హలంత పదాలకు చివర 'ము'తెలుగులోని నపుంసక పదరూపాల సామ్యవలనం జరిగిందనవచ్చు. హిందూస్తానీ తత్సమాలు తెలుగులో ఏర్పటంలో సంస్కృత తత్సమ ప్రభావం ఇక్కడ కనిపిస్తుంది.

వృక్షః 'నుండి' వృక్షము ఏర్పడినట్టే 'ము' చేర తత్సమ రూపాలేర్పటు సామ్యం వల్లకావచ్చును.

హిం తె

ఉదా : గజ్ > గజము
దుకాన్ > దుకాణము
మైదాన్ > మైదానము
ఝుగ్‌రా > ఆగడము
తులా > తులము
,, > పలము

'షరాయి' 'మిరిజాయి' అనే పదాల సామ్యంవల్ల కొన్ని పదాలకు 'యి' ఆగమంగా వచ్చి చేరింది.

హిం తె

ఉదా > జుబ్బాయి
చొగా > చొక్కాయి

అన్యాయము, ఉపాయము వంటి తెలుగు పదాల సామ్య ప్రభావం చేత 'బద్‌నామా' అనే హిందూస్తానీ పదం 'బదనాయము'గా ఉపయోగించబడింది.

## సంకేత వివరణ

> మొన వైపున్న రూపానికి మరోవైపున్న రూపం మూలం.
-గ- ఈసర్తుల మధ్య ఉన్నధ్వని పదమధ్యస్థానాన్ని తెలియజేస్తుంది.
గ- పదాది స్థానాన్ని సూచిస్తుంది.
-గ పదాంత స్థానాన్ని సూచిస్తుంది.
హిం హిందూస్థానీ
తె తెలుగు

*అధో జ్ఞాపికలు* Post notes

1· Sethupillai, R.P. Words and their significance Taomnil Lingustics P I
2 Hocketes Charles. f. A Courrc in Modern Lingustcs. P. 418.

పి. కుసుమ కుమారి
లెక్చరర్ ఇన్ తెలుగు,
శ్రీ పద్మావతి మహిళా విశ్వ విద్యాలయం
తిరుపతి - 517502.

# సాహిత్యగోష్ఠి

## ప్రపంచ సాహిత్యానికి కుప్రీన్ బహూవంతి "రాళ్ళవంకీ"

అలెగ్జాండర్ ఇవానోవిచ్ కుప్రీన్ అద్భుతమయిన మనిషి. కథారచయితగా రష్యన్ సాహిత్యంలో గిరిశిఖరంలా నిలబడగలిగేటు రచయితగా తాను నిలబడగలగడానికి నానా అవస్థలు పడ్డాడు స్వభావరీత్యా కరుణ, జాలి. దయ కలిగి దృఢమయిన మనస్తత్వము కలవాడు ఈ మనస్తత్వము ఆయన కథల్లోని పాత్రల్లో మనకు కనిపిస్తుంది. కుప్రీన్ జీవితాద్యంతం వైవిధ్యాలతోటి, వైరుధ్యాలతోటి నడిచింది. మామూలు ప్రజల గురించి కథలు చెప్పడం అంటే కుప్రీన్‌కు మహాఇష్టం. ఆ ప్రజల జీవిత లోతుల్ని స్పృశించి జీవితాల్ని పరిశీలించి ఒకో జీవితానుభవాన్ని ఒక్కొక్క కోణంలో దర్శింపచేస్తాడు.

"మనిషి ఈ లోకంలోకి అనంతమయిన స్వేచ్ఛ కోసం, సృజనాత్మకకృషి కోసం, ఆనందాన్ని పొందడం కోసం వచ్చాడు" అన్న కుప్రీన్ వాక్యాలు రచనా వ్యాసాంగానికి సరిగ్గా సరిపోతాయి

కుప్రీన్ 1870 ఆగష్టు 26న ఓ చిన్న కుటుంబంలో జన్మించాడు. జీవితంలో ఎన్ని కష్టాలు ఎదురుకోవాలో అన్నిటిని ఎదురుకొన్నాడు. కుప్రీన్ మొదటి రచన "కడపటి రంగస్థలప్రవేశం". ఆ కథని పాఠకులు గురించలేదు, కాని రచయితని శిక్షకు గురిచేసింది. ఆ తర్వాత ఆయన ఎన్నో కథలు వ్రాశాడు. సుప్రసిద్ధమయిన కథలెన్నో సంపుటాలుగా వచ్చాయి.

"రాళ్ళవంకీ" లోని ఏడు కథలు రష్యన్ సాహిత్యానికి ఆణిముత్యాలు.

'మోలక్' కథ పెట్టుబడిదారీ వ్యవస్థను కంపెనీ యజమానుల ధనాశను చిత్రిస్తుంది. 'మోలక్' కథలో ఫ్యాక్టరీలో పనిచేసే 'బొబ్రోవ్' చిన్నపాటి రచయిత. ఫ్యాక్టరీని గురించి నిర్వాహణ గురించి 'మోలక్' కథ విపులీకరిస్తుంది.

'మోలక్' కథంతా బొబ్రోవ్ మీదనే ఆధారపడి ఉంది. కథారచయితగా ఉంటూనే ఆ ఫ్యాక్టరీ ఇంజనీర్‌గా పనిచేస్తుంటాడు. ఫ్యాక్టరీలో రక్షణలేని కార్మికుల జీవితాలపట్ల బొబ్రోవ్ తీవ్రమైన వ్యథకు లోనవుతాడు. లాభాలు గడిస్తున్న కంపెనీ యజమానులు కార్మికుల కనీస అవసరాలను తీర్చలేక పోతారు. ఈ స్థితిలో బొబ్రోవ్ సినికల్‌గా ప్రవర్తిస్తూ ఉంటాడు. ఒకవేపు కార్మికుల గురించి ఆలోచన రెండోవైపు జినేంకోల కుటుంబంలోని 'నీనా' పట్ల ఆకర్షితుడై ప్రేమను వ్యక్తం చేయలేక పోతాడు, 'మోలక్' కథకు నిజాయితీ నిండిన మనిషిగా బొబ్రోవ్‌ను సృష్టించాడు కుప్రీన్. బొబ్రోవ్‌ని ఇష్టపడే వాళ్ళు చాలా తక్కువ మంది. బొబ్రోవ్ నిష్కర్షమైన నడవడి ఏ వంచన నటనలేని ప్రవర్తన మిగతా వ్యక్తులకు కష్టప్రాయంగా అనిపిస్తుంది.

బొబ్రోవ్‌కు అతి సన్నిహితుడు డాక్టర్ ఆయిన

గోల్డ్‌బెర్గ్‌తో కంపెనీ కార్మికుల జీవితాన్ని ఎట్లా కబళిస్తుందో చెప్పుకుంటాడు. కార్మికులకు అతి తక్కువ జీతాలిచ్చి కార్మికుడి జీవితంలోంచి సగ భాగాన్ని లాభాలుగా తీసుకొని రెండవ సగాన్ని మృత్యుముఖంలోకి విసిరేస్తున్న కంపెనీల పట్ల బొబ్రోవ్‌కు ఉన్న అసహ్యాన్ని 'మోలఖ్' కథ ప్రదర్శిస్తుంది.

"అడుగో అక్కడ ఉన్నాడు. మానవ కవోష్ణ రక్త దాహంతో ఉన్న 'మోలఖ్'" అంటూ తాను పనిచేసే కంపెనీని చూపిస్తాడు. 'మోలఖ్' ప్రాచీన ఫోనీషియాన్ దేవుడు. నిప్పుకీ యుద్ధానికీ అధినేత. ప్రాచీన దేవుళ్ళందరిలోను రక్త పిపాసి దేవుడు 'మోలఖ్'. 'నీనా'తో తన ప్రేమని వ్యక్తం చేయలేక చేసి సంధిగ్ధావస్థలో ఉన్న బొబ్రోవ్‌కు రోజుకు ఇరవై ఏళ్ళ మానవ జీవితాన్ని రాక్షసిలా హరించి వేస్తున్న కంపెనీని చూసి వ్యథ చెందుతాడు. బొబ్రోవ్ అంతరంగ చిత్రణ నేర్పుతో చిత్రించాడు కుప్రీన్.

బొబ్రోవ్ తపన వేదన మోలఖ్ ముందు పనిచేయవు. చివరకు మోలఖ్‌ని ఏశక్తి నిరోధించలేదు. కార్మికులలో మిగిలి ఉన్న సహనము 'మోలఖ్' దురాగతాలకు ఊపిరి కార్మికుల ఐక్యతకు, తిరుగుబాటుకు చిహ్నంగా కూడా ఈ కథని చూడవచ్చు. తిరుగుబాటు చేస్తున్న కార్మికులను కంపెనీ నింపాదిగా అణచివేస్తుంది. కథ ముగింపు విషాదాంతమైంది. 'మోలఖ్'ని ఎదురించే శక్తిగల బొబ్రోవ్ మత్తుమందులో ఈ వాస్తవాలకు దూరంగా ఉండిపోతాడు. పరిష్కారం కాలం మాత్రమే సూచిస్తుందని ముగిస్తాడు కుప్రీన్.

కుప్రీన్ కథల్లో కుప్రీన్‌కు అమితంగా నచ్చిన పాత్ర 'ఓలేస్యా'

'ఓలేస్యా' కథలోని గొప్పదనం, అందం అంతా 'ఓలేస్యా' అమాయకమైన సౌందర్యానికి చెందింది. కుప్రీన్‌కు ప్రకృతిపట్ల ఇష్టం కూడా ఎక్కువని ఈ కథ తెలియజేస్తుంది. 'ఓలేస్యా' అమాయకంగా లోకం తెలియని పసిపిల్లలా ఉంటుంది మంచి చెడులు అన్నీ తెలుసు. ప్రవర్తన కూడా తెలిసిందే. మరి 'ఓలేస్యా' ప్రత్యేకత ఏమిటి. ఓలేస్యాది నిసర్గ సౌందర్యం. ప్రకృతి అంతా ఓలేస్యాలో కనిపిస్తుంది. ఓలేస్యా మనూలిఖామనుమరాలు ఇద్దరూ అడవిలోనే నివసిస్తుంటారు ఓలేస్యాకు నగర జీవితం అంటే అయిష్టం. ఆ కల్మషంలో తాను ఒదిగి పోలేను అనుకుంటుంది. స్వచ్ఛమైన, నిర్మలమైన ఓలేస్యా పట్టణవాసికి మన సిచ్చి తాను అతడికి తగిన దానను కాదనుకుంటుంది.

కథానాయకుడితో ఏర్పడ్డ అనుబంధం ఆ ఇద్దరి మధ్య ఉన్న మహోన్నత ప్రేమోద్దీపన. ఓలేస్యా వెన్నెల రాత్రులు, కథానాయకుడి మానసిక స్థితిని ప్రకృతిలోంచి దర్శిస్తాడు. 'ఓలేస్యా'లో సాతాను అంశవుందని నమ్మకం. చీట్లతో జోశ్యం చెప్పడం, జరుగబోయేది ముందుగానే ఓలేస్యాకు తెలుస్తుంది. అందువల్ల ఓలేస్యాకు చర్చి అంటే భయం.

ప్రియుడి అజ్ఞ–కోరిక మీదట ఓలేస్యా చర్చిలోకి ప్రవేశిస్తుంది. ప్రార్థనలో ఉండగా కొందరు ఓలేస్యాను గుర్తుపట్టి 'మనూలిఖా' మంత్రగత్తె మనుమరాలని చుట్టూచేరి బంధిస్తారు. అక్కడ తనను నానా హింసలకు గురిచేసారు ఒంటిమీద తారుపూసి ముఖం మీద కట్టెలతో గీస్తారు. ఒంటరి 'ఓలేస్యా' తప్పించుకొలేక వాటిని అనుభవించి శపిస్తూ తిరిగి వస్తుంది. "సరే కానీండి! మీరు ఇది మరిచి పోరు కళ్ళు చిల్లులు పడేటు ఏడుస్తారింకా" తీవ్రంగానే తిడుతుంది.

గ్రామస్థులు భయపడి భవిష్యత్తులో ఏదైనా హాని జరిగితే మనూలిఖాను ఓలేస్యాను బ్రతుకనియ్యరు. ఆ విషయం ఓలేస్యాకు తెలుసు.

ఓ విధమయిన షాక్‌కు గురి అయి జ్వరగ్రస్తమవుతుంది. ఓదార్చడానికి అతడు వెళ్ళినపుడు తన భయాలు అన్నీ విప్పి చెప్పుకుంటుంది. అక్కడ కుప్రీన్ చూపించిన ప్రజ్ఞ పాఠకుడిని గుండెలవిసి పోయేలా చేస్తుంది. చివరకు మనూలిఖా, ఓలేస్యాలు ఆ అడవిలోని ఇంటిని వదిలి వెళ్ళిపోతారు.

కుప్రీన్ ఈ కథలో తాను కథానాయకుడై మమేకం చెందుతాడు ఓలేస్యా స్మృతి చిహ్నంగా పగడాలు అనిపించే ఎర్రని పూసల దండని వదిలి వెళ్ళుతుంది. పాఠకుడు ఓలేస్యా ఆగమనం కోసం నిరీక్షిస్తూనే ఉంటాడు.

ఓ సాదా ఫిడేలు వాయిద్యకారుడి జీవితకథే 'గంబ్రీనస్' (దక్షిణ రష్యాలో సందడిగా ఉండే బీరు దుకాణం పేరు ఇది) ఈ కథలో వ్రాసిన ప్రతిదీ నిజమేనని 'పౌస్టోవ్‌స్కీ' అంటాడు, గంబ్రీనస్ కథలోని భాష అద్భుతంగా ఉందని లియోటాల్‌స్టాయ్ తన కుటుంబ సభ్యులకు చదివి వినిపిస్తాడు

'సాష్కా'కి ఫిడేలు తప్ప ప్రపంచం తెలియదు. గంబ్రీనస్‌లోకి అందరి కంటే ముందుగా వచ్చి ఓ మగ్గు బీరు సేవించి వేదిక మీద కూర్చుంటాడు. తోడుగా వాడిలో 'బేలొచ్కా' అనే కుక్క పిల్ల ఫిడేలుతో కూని రాగాలు తీస్తుంటుంది. 'సాష్కా'లేని గంబ్రీనస్‌ని ఎవరూ ఊహించలేరు. రోజూ అక్కడ జరిగే సంగీత కార్యక్రమాలు, పాటలు అక్కడికి వచ్చి పోయే వారిని ఎంతో ఆనందింప జేస్తుంటాయి. గంబ్రీనస్ ఖాతాదారులందరికీ 'సాష్కా' చిర పరిచితుడు. అందరూ ఎవరికీ ఏమి కావాలో అడిగిన వెంటనే గీతాన్ని వాయించేవాడు. అందరి హృదయాల్లోను సాష్కా ఎంతో నైపుణ్యం గల ఫిడేలు వాయిద్యకారుడు.

అనుకోకుండా 'సాష్కా'ని యుద్ధంలోకి బలవంతంగా తీసుకుపోతారు. ఆ యుద్ధంలో కూడా ఫిడేలు వదిలి పెట్టలేదు. కొన్నాళ్ళ తర్వాత యుద్ధం నుండి గంబ్రీనస్‌కి చేరుతాడు గంబ్రీనస్‌లో పరుచుకున్న చీకటి, విషాదం, నిశ్శబ్దం విడిపోతాయి 'సాష్కా'లేని రోజుల్లో గంబ్రీనస్ భయంకరమైన ఒంటరి తనాన్ని మోయవలసి వచ్చేది. 'సాష్కా' ఏమీ ఆశించేవాడు కాదు. ఎవరేనా ఏదయినా ఇస్తే కాదనేవాడు కాడు. కోటు జేబులో భద్రంగా దాచుకొనే వాడు.

రెండోసారి పోలీస్ ఏజంట్లు స్తోత్రగీతం పాడమంటే అందుకు నిరాకరిస్తాడు. చిన్నగొడవతో గంబ్రీనస్ గంభీరంగా తయారవుతుంది. 'సాష్కా' ఫిడేలు ఆ ఏజంట్లని గాయపరుస్తుంది.

'సాష్కా'ని బలవంతంగా పోలీసు స్టేషన్‌కు తీసుకెళ్తారు. క్రమంగా 'సాష్కా' గురించి అందరూ మరిచి పోతారు 'సాష్కా' స్థానంలో అతని శిష్యుడు వస్తాడు. అదే సమయంలో సాష్కా ప్రత్యక్ష మవుతాడు. అందరి దృష్టి సాష్కా చేతుల మీద పడుతుంది. 'సాష్కా' ఎడమ చేయిని మెలి పెట్టి అణగ్గొడుతారు. చాచడానికి వంచడానికి వీలుండదు. ఫిడేలు వాయించలేదని అందరూ విచారాన్ని వ్యక్తం చేస్తారు. సాష్కా మాత్రం తన శిష్యుడితో గొర్రెల కాపరి వాయించమని పురమాయిస్తాడు మళ్ళీ మునుపటి ఉత్సాహం కొత్తదనం గంబ్రీనస్‌లోకి వస్తుంది. తానుకూడా 'బకారినా' మీద 'గొర్రెలకాపరిని' వాయిస్తాడు. సాష్కా నింపాదిగా "సరే మంచిది మీరు ఒక మనిషిని అవిటివాన్ని చేయవచ్చు కాని ఒక కళమాత్రం నిలుస్తుంది. ప్రతిదాన్ని జయిస్తుంది" అంటాడు.

కుప్రీన్ కథా వైశిష్ట్య గురించి ఆంద్రేయ్ బెర్నిషోవ్ మాటల్లోనే చెప్పాలి. కుప్రీన్ కథా వస్తువు సామాగ్రి అంతా జీవితం చుట్టూ పరుచుకొన్న వస్తువులే. కథలు కల్పనలుగా ఉండక, కఠిన వాస్తవాలుగా ఉంటాయి. కథకు ప్రాణం వస్తువైతే సంవిధానము, శైలి దేహాలు. కుప్రీన్ కథల్లో ఏ వాక్యము అనవసరమనిపించదు. అసంబద్ధంగా ఉండదు.

వాస్తవ సంఘటనలని కథలుగా మలచడంలో కుప్రీన్ పరిపూర్ణతకే పరిపూర్ణతని సాధిస్తాడు.

'ఇజుమ్రుద్' ఓ చిన్నగుర్రం. పందెపు గుర్రం. ఇజమ్రుద్ అంటే 'మరకతం' కథలోని గుర్రమూ, కథా మరకతమే. కథా రచన చరిత్ర కొంచెంచిత్రం గానే ఉంటుంది. ఇరవయ్యో శతాబ్దపు ఆరంభంతో ఎక్కువ ప్రసక్తంగా ఉన్న సంఘటనని కుప్రీన్ కథగా చెప్పదలిచాడు. ఈ కథకు రచయిత అసాధారణమయిన రూపాన్ని ఎంచుకొన్నాడు. ప్రపంచాన్ని గుర్రపు గ్రహణ గుండా చూపించాడు. ఆయన ఆ కథని ఎంత హృద్యంగా చెప్పగలిగేడు అంటే తానే ఒక్కోచోట ఆశ్వం అయ్యాడు అనిపిస్తుంది అంటాడు అంద్రేయ్ చెర్నిఫోవ్ లియోటాల్‌స్టాయ్ 'కొలబద్ద' కథకు స్మృత్యర్థంగా దీన్ని వ్రాశాడు. ఓ గుర్రపు శాల యజమాని గుర్రానికి విషం పెట్టి పందెపు గుర్రాన్ని చంపుతాడు. ఇజమ్రుద్ కూడా విష ప్రయోగానికి గురై చనిపోయింది.

కథా కళాఖండాల్లో 'రాళ్ళవంకీ'ని కూడా చెబుతారు. ఆయన కథల సంపుటానికి 'రాళ్ళవంకీ' అని పెట్టారు. మానవాతీతమైన ప్రేమ కథ అది.

ఈ కథ గురించి 1911 మార్చిలో మాక్సిమ్ గోర్కీ పొగుడుతూ వ్రాశాడు.

"కుప్రీన్" వ్రాసిన రాళ్ళవంకీ అద్భుతమయిన రచన నాకు ఆనందంగా ఉంది. ఈరోజు నాకువిందు రోజు. అద్భుతమయిన సాహిత్యం మొదలవుతుంది."

'రాళ్ళవంకీ' మహోత్కృష్టమయిన రచన అనటానికి సందేహం అవసరం లేదు. కుప్రీన్ ప్రతిభ రాళ్ళవంకీ కథలో ఖచ్చితంగా కనిపిస్తుంది.

వసిలీల్యోవిచ్ షేయిన్ భార్య 'వేరా'. వేరానిటెలిగ్రాఫ్ గుమస్తా అమితంగా ప్రేమిస్తాడు. ఉత్తరాల ద్వారా బహుమతుల ద్వారా తన ప్రేమని వ్యక్తం చేస్తూనే ఉన్నా వేరా చలించదు. టెలిగ్రాఫ్ గుమస్తా అయిన జెల్తకోవ్‌కు వేరా ఆరాధ్యదేవత, తన హృదయరాణి, సౌందర్యపు మధుధారలతో జెల్తకోవ్ మతి పోగొట్టుకున్నట్టు ప్రవర్తిస్తాడు. షేయిన్, జెల్తకోవ్‌ని ఇంటికి పిలిపించి ఈ పనులన్ని మానుకొమ్మని లేనట్లయితే తీవ్రపరిణామాలు ఎదుర్కోవలసి వస్తుందని చెబుతాడు. జెల్తకోవ్ నిరాకరించి వేరాతో చివరి సారి మాట్లాడేందుకు, చివరి ఉత్తరం వ్రాసేందుకు అనుమతి కోరుతాడు జెల్తకోవ్‌మాటల్లో ప్రేమనుగురించి-

"ఆ మాటలని అనడం కష్టం— నేను నీభార్యను ప్రేమిస్తున్నాను అని అనడం. కాని ఏడు సంవత్సరాల నిరాశాభరిత నిరహంకార ప్రేమ నాకా హక్కునిస్తుంది. మొదటగా వేరాకి పెళ్ళికానప్పుడు నేను తెలివితక్కువ ఉత్తరాలు వ్రాశానని వాటికి సమాధానం కూడా ఆశించానని ఒప్పుకొంటున్నాను. 'నా కడపటి చర్య, అంటే రాళ్ళవంకీని పంపడం అనేది ఇంకా తెలివి తక్కువ తనం అని ఒప్పుకొంటాను. కాని-నేను తిన్నగా మీ కళ్ళలోకి చూస్తున్నాను. మీరు అర్థం చేసుకొంటారనే అనుకొంటాను. ఆమెని ప్రేమించకుండా మానెయ్యడమనేది నా శక్తికి మించిన పని అని నాకు తెలుసు. చెప్పండి. ఏమండీ! ఒక వేళ మొత్తం మీకు అసహ్యంగా ఉండిన, ఆ అనుభూతిని విచ్ఛిన్నం చేయడానికి మీరు ఏమి చేస్తారు? నన్ను వేరే ఊరికి పంపిస్తారా? కాని అక్కడా వేరా నికొలాయెవ్నాని ఇక్కడిలాగే ప్రేమిస్తూ ఉంటాను. జైల్లో పెట్టిస్తారా? అక్కడ ఆమెకు నేను బ్రతికి ఉన్నానని తెలియ జేయడానికి అవకాశం దొరుకుతుంది. ఇక మిగిలిన పరిష్కారం మృత్యువు. మీకు అదే కావాలంటే నేను మృత్యువుని ఏ రూపంలోనైనా అంగీకరిసాను.'

జెల్తకొవ్ అనుభూతి, వాదన, ప్రేమ వేరాకి చివరగా వ్రాసిన ఉత్తరం కుప్రీన్ అనుభూతి స్థాయిని ఉన్నత శ్రేణిలో నిలబెడుతుంది. ప్రతిపదం, వాక్యం

ప్రేమతోటి, అర్ద్రతతోటి నిండి ఉంటాయి. జెల్టైకొవ్ ప్రేమ, ఉదాత్తమయిన స్వభావం వేరా నిరాకరణని సహించలేక ఆత్మహత్య చేసుకొంటాడు. వేరా జెల్టైకోవ్ శవాన్ని చూడడానికి వెళ్ళి నుదిటి మీద తన ప్రేమని వెల్లడి చేసి వస్తుంది.

మనుషుల మనస్తత్వాలని ఆకళింపు చేసికొని పరిసరాలను చదివి ప్రకృతిలో ఉన్న పోలికలకు ప్రతిస్పందించే పాత్రలే కుప్రీన్ కథా వస్తువులు. ఇక బొబ్రోవ్, ఓలెస్యా, సాషా, ఇజుమ్రుద్, వేరా, జెల్టైకోవ్ కుప్రీన్ రచనా పటిమని ఉత్కృష్టతని తెలియ చెప్తాయి. సాహిత్య ప్రపంచానికి కుప్రీన్ ఇచ్చిన బహుమతి 'రాళ్ళపంక్తి'.

బి. అయిలయ్య
పోతన హాస్టల్ రూం.నం. 11.
విద్యారణ్యపురి
కాకతీయ యూనివర్సిటి
పిన్-506009.

# ఆధునిక తెలుగు సాహిత్యం సామ్యవాదం

పద్దెనిమిదవ శతాబ్దములో ఫ్రెంచి విప్లవము పెను తుఫానువలె వచ్చి విజ్ఞానపు ఔన్నత్యాన్ని చాటినది. సమాజంలో జరుగుతున్న అన్యాయాలు, అత్యాచారాలు, సాంఘిక అసమానతలకు మూలకారణం ధర్మం కాబట్టి వివిధ ధర్మాల ప్రభావాలను అరికట్టుటకు తార్కికాధారమైన విజ్ఞానాన్ని నలుమూలాల వెదజల్లడమే ఏకైక మార్గమని పలువురు భావించారు.

రూసో, మార్క్స్, ఎంగిల్స్, లెనిన్ మున్నగు వారంతా పద్దెనిమిది, పందొమ్మిదవ శతాబ్దులలో తమ రచనల ద్వారా ప్రపంచంలోని అజ్ఞానాంధకారాన్ని నశింపజేయడానికి విజ్ఞానజ్యోతులు వెలిగించి, నలుమూలలా ప్రకాశకిరణములను వెదజల్లారు. క్రమంగా వారి అనుయాయుల సంఖ్య ప్రపంచంలోని అన్నిదేశాలలో పెరిగినది.

స్వాతంత్ర్యానంతరం భారతదేశానికి రాజకీయ స్వాతంత్ర్యం సిద్ధించినా, ఆర్థిక సామాజిక స్వాతంత్ర్యం సిద్ధింపలేదు. అందుకు ముఖ్యకారణం ఆర్థిక అభ్యున్నతికి, సామాజిక ఔన్నత్యానికి కావలసిన మార్గాలను, విధానాలను సరిగ్గా అన్వేషించి రూపొందించుకోలేక పోవడమే. దానికి తగిన విద్యావిధానాన్ని మన విద్యావేత్తలు తీర్చిదిద్ది అమలుచేయలేకపోయారు అందువల్లనే "రాజ్యాంగాన్ని" నిర్మించిన పెద్దల ఆశయాలు, మతాతీత ప్రజాస్వామ్య, సామ్యవాద వ్యవస్థ స్థాపన" నేటివరకు ఫలించలేదు. పెద్దల ఆశలు, ఆకాంక్షలు అడియాసలయ్యాయి.

భారతదేశం స్వాతంత్ర్యం పొందిన తరువాత ఇక్కడ వెలువడిన తెలుగుసాహిత్యంపై ఒక భారతీయ సామాజిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితుల ప్రభావమే కాక యావత్ప్రపంచ సామాజిక, ఆర్థిక, రాజకీయ—సాహిత్యక పరిస్థితుల ప్రభావం స్పష్టంగా కన్పిస్తుంది విశ్వవిఖ్యాతి గాంచిన మేధావుల శాస్త్రవేత్తల, దార్శనికుల ఆలోచనావిధానాలు, అమెరికా, ఫ్రాన్సు, రష్యా, చైనాలలో చెలరేగిన విప్లవాలు, వాని పరిణామాలు, ప్రతిబింబాలు తెలుగు సాహిత్యంలో ప్రతిధ్వనించాయి. వీని ఫలితంగానే తెలుగు సాహిత్యం వికసించ సాగింది. స్వాతంత్ర్యానంతరం తెలుగులో వెలువడిన సాహిత్యం ద్వారా ప్రజల ఆశలు, ఆకాంక్షలు స్పష్టంగా వ్యక్తీకరింపబడుతున్నవి. తెలుగుకవులు రచయితలు మన సామాజిక జీవితాలకు సంబంధించిన సిద్ధాంతాల యెడల సావధానచిత్తులై మతాతీత, ప్రజాస్వామ్య సామ్యవాద ప్రవృత్తులను ప్రత్యక్షంగానో, పరోక్షంగానో తమ రచనలలో ప్రతిపాదించారు.

వ్యక్తివాదానికి స్వాభావికంగా ఏర్పడిన ప్రతిక్రియయే సామ్యవాదం. సామ్యవాదం ఒక రకమైన అభ్యుదయకరమైన సమిష్టి ఆలోచనా పద్ధతి. నేటి సమాజంలోని అస్తవ్యస్త పరిస్థితులను దాని జీర్ణ స్వరూపాన్ని అభివర్ణించుతూ, దానిలో ఆమూల పరివర్తన అవసరమంటుంది. సమాజంలో కేవలం పరివర్తనే లక్ష్యమైతే, సమాజంలో ఆ పరివర్తన తరువాత అరాజకం వ్యాపిస్తుంది. అందువల్ల పరివర్తన తరువాత తత్సమాజానికి అవసరమైన క్రొత్త ఆదర్శాలను సంఘటిత పరచి సమాజ స్వరూపాన్ని మార్చేముందు క్రొత్త ఆదర్శాల సాపన ఎంతైన అవసరముందని అంటుంది.

సమాజంలోని ఏవ్యక్తి అయినా, వాడెంత గొప్ప వాడయినా, సమాజానికి వినాశకరమైన వ్యవస్థకు పాల్పడితే, సమాజక్షేమం కొరకు అనగా సామాజిక. ఆర్థిక న్యాయసాపనకై, ఆ వ్యవస్థను నిర్దాక్షిణ్యంగా, నిర్మూలించవలసిన అవసరం ఎంతైనా ఉందని చెప్తుంది. ఆదర్శాల ఆచరణకు, సత్సంకల్పం, ధృడ భావం అవసరమంటుంది సామ్యవాదం కేవలం ఒక వ్యవస్థ మాత్రమే కాదు. అది ఒక సంపూర్ణమైన జీవన ప్రణాళిక, వ్యాపకమయిన జీవిత విధానం. అయితే నేటి పరిస్థితుల్లో నాకు సామ్యవాద వ్యవస్థలో విశ్వాసముంది కాని దానిపై మూఢాభిమానం మాత్రంలేదు. సమాజంలోని ఆర్థిక దోపిడి అంతం కావాలి. ప్రజాపీడిన నిర్మూలించబడాలి. ఇది నిస్సందేహంగా నేడు సామ్యవాదం ద్వారానే నెరవేరుతుంది. ఎక్కువ మంది ప్రజలు సాంఘికంగా, ఆర్థికంగా వెనుకబడివున్నారు. కొందరు ధనవంతులు, పారిశ్రామిక వేత్తలు, భూస్వాములు, వారిని పీల్చుకు తింటున్నారు. నిరుపేదలైన ప్రజలు, బడుగువర్గాలవారు, దళితులు కూడు, గుడ్డ, గూడు లేక తమ సంస్కృతి సౌరభాన్ని కళాసౌందర్యాలను అస్వాదింపలేకపోతున్నారు. కాబట్టి సామ్యవాదం నేడు ప్రజల జీవితాలను భౌతికంగానేకాక మానసికంగా ఆధ్యాత్మికంగాఉన్నత స్థితికి తీసుకుపోగలదని ఆశిద్దాం. అయితే ఒకే వ్యవస్థ ఎల్లకాలం శాశ్వతంగా మనజాలదు. పరివర్తన ప్రకృతి నియమం. కాలక్రమేణా అత్యున్నతమైన జీవితపు విలువల కోసం. ఆనందానుభూతిని పొందేందుకు మార్పులు, చేర్పులు వస్తూనే ఉంటాయి. ఇదొక చారిత్రిక సత్యం. తెలుగు సాహిత్యంలో ఈ సామ్యవాద ప్రవృత్తికి విశేషస్థానం లభించింది. అందువల్లనే కవిత్వం. నవల, కథ, నాటకం మొదలైన అన్ని ప్రక్రియలలో సామ్యవాద ప్రకృతిచే ప్రభావితమైన సాహిత్యం విరివిగా లభిస్తుంది. అభ్యుదయ కవిత్వపు మూలధారం సామ్యవాదమే. నేటి పెట్టుబడి దారీ సమాజంలో సామ్యవాదానికి స్వాగతం పలికిన మొదటి కవి శ్రీ. శ్రీ.

ఆయన "మహాప్రస్థానము" కావ్యసంకలనంలో సామాజిక స్థితిగతులు, ఆర్థిక దుస్థితిని సూటిగా వర్ణించాడు. జమీందారులు, పెట్టుబడిదారులు స్వార్థంతో స్వప్రయోజానాల కొరకై పెత్తనాలు సాగిస్తున్నారు. శ్రామికుల శ్రమపై జీవిస్తున్నారు. వారు సమాజంలోని ఆర్థిక అసమానతలను పెంచుతూ దాని కారణంగా శ్రామికుల జీవితాన్ని, కష్ట జీవుల బ్రతుకుల్ని దుర్భరం చేస్తున్నారు. మహాకవి శ్రీ. శ్రీ. సామాజిక అన్యాయానికి వ్యతిరేకంగా విప్లవ శంఖాన్ని పూరించాడు. సమాజంలో తిరస్కృతులని. పీడితుల, అన్నార్తుల దయనీయ స్థితిని యిలా వర్ణించాడు.

"పతితులార
భ్రష్టులార
బాధా సర్పదష్టులార
బ్రతుకుకాలి
పనికిమాలి
శని దేవత రథచక్రపు
టిరుసులలోబడి నలిగిన
దీనులార
హీనులార

కూడులేని
పక్షులార, భిక్షులాగ
సఖులవలన పరిచ్యుతులు
జనులవలన తిరస్కృతులు
సంఘానికి బహిష్కృతులు
జీతాసువులు
చ్యుతాశయులు
హృతాశ్రయులు
హతాశులై
ఎడపకండేడవకండి!

శ్రీరంగం నారాయణబాబూ, సోమసుందర్ కూడ భారతీయ సమాజంలోని దరిద్రుల జీవితాల్ని, హృదయాల్ని స్పర్శించేటట్టుగా చిత్రించారు నారాయణబాబు పెట్టుబడిదారీ వ్యవస్థను అంతం చేయాలంటూ యీ విధంగా ప్రబోధించాడు—

పతితులు పలికించే
మాటల
జిలి బిలి తేటలు
చీకటి గుండె కదిల్చే
జాలిపాట
పాడమంది
లోపలికే
చూడమంది...

ఈ విధంగా కవులు తమ కవిత్వంద్వారా పీడిత ప్రజానీకం యెడల సానుభూతి వ్యక్తీకరించారు. శ్రీశ్రీ ప్రభృతుల కవిత్వప్రభావంచే స్వాతంత్ర్యానంతరం సామ్యవాద ప్రవృత్తినవలంబించి కవిత్వం వ్రాసిన వాళ్లలో ఆరుద్ర, రెంటాల గోపాలకృష్ణ, రమణారెడ్డి, అనిసెట్టి రామదాస్, దాశరథి, బాలగంగాధర తిలక్, కుందుర్తి, గంగినేని వెంకటేశ్వరరావు, గజ్జల మల్లారెడ్డి ప్రముఖులు. వీరందరి రచనల్లో భారతీయ సమాజపు ఆర్థికస్థితే వర్ణింపబడ్డది. వీరందరూ ముక్తకంఠంతో శ్రామికుల పీడనను వ్యతిరేకించి వారి దయనీయ స్థితిని సూటిగా వర్ణించారు. ఉత్పత్తి సాధనాలపై సమాజంలో ఎవరో ఒక్కరి అధికారం కాక యావత్సమాజపు అధికారం ఉన్నప్పుడే సమాజంలోని ఈ భయంకర దుస్థితి అంతంకాగలదు. అప్పుడే జాతీయాదాయం కొందరి జేబుల్లోకే కాక అందరికీ న్యాయోచితంగా లభ్యమవుతుంది. అత్యాధునికులైన దిగంబర కవుల ఉద్దేశ్యం కూడ ఇదే మూఢ విశ్వాసాల బారినుండి అందరిని రక్షించాలని చెరబండరాజు అంటున్నారు.

"మూఢ నమ్మకాల ఉక్కు కౌగిళ్ళలో
నంగనాచి నాయకుల దొంగవేషాలో
నలిగే అలగా జనం కళ్ళగంతలు చించుకొని
బయటికి రావాలి" ఈ విధంగా ఆధునిక తెలుగు కవిత్వంలో అనేక మంది కవులు అంధవిశ్వాలను ఖండిస్తూ ప్రజలను జాగృతంచేసి చైతన్యవంతులను

భారతీయ సమాజంలో ప్రబలిన ఆర్థిక అసమానతలను తమ నవలల్లో కథల్లో నాటకల్లో కూడా తెలుగు రచయితలు చక్కగా చిత్రించారు. శ్రీ మహీధర రామమోహన రావు తన "రథచక్రాలు" నవలలో ప్రజల సామాజిక జీవితాలలోని ఒడిదుడుకులను సజీవంగా చిత్రీకరించారు. శ్రీ ఉప్పల లక్ష్మణరావు తన "అతడు ఆమె" అను నవలలో సంస్కరణ వాదం సామ్య వాదములను వర్ణించారు. శ్రీ కాడవటి గంటి కుటుంబరావు తన "చదువు" అనే నవలలో ఆర్థిక అసమానతలకు సరియైన మందు సామ్యవాదమని నిరూపించారు. ఇంకా ఎంతో మంది రచయితలు తమ రచనలలో నేటి ఆర్థిక, రాజకీయ, సామాజిక అవకతవకలకి, దుస్థితికి, దుష్ఫలితాలకి సామ్యవాద వ్యవస్థాపనే ఏకైక పరిష్కార మార్గమని నిర్దేశిస్తూ తమ సామాజిక బాధ్యతలను చక్కగా నిర్వహిస్తున్నారు.

ప్రొ. జి. సుందరరెడ్డి
ఆంధ్రా యూనివర్సిటీ వాల్టేర్-530 003

# దక్షిణ భారత హిందీ ప్రచార సభ ప్రచురణలు

| | |
|---|---|
| 1. హిందీ ప్రచార్ కా ఇతిహాస్ | 10-00 |
| 2. తెలుగు సాహిత్య వ్యాసములు | 5-00 |
| 3. వ్యాసమంజూష | 15-00 |
| 4. తెలుగు భాషా బోధిని -1 | 1-00 |
| 5 " 2 | 1-20 |
| 6. " 3 | 3-50 |
| 7. " 4 | 1-50 |
| 8. తెలుగు కథా మంజరి - 1 | 1-00 |
| 9. " 2 | 1-00 |
| 10. తెలుగు రచనా అనువాదం - 1 | 0-75 |
| 11. " 2 | 1-00 |
| 12. తెలుగు పద్యమంజరి | 3-50 |
| 13. పద్యమాల | 6-00 |
| 14. కావ్యమాల | 10-00 |
| 15. తెలుగు గల్పమాల — గోదావరీ హంస్‌పడీ | 15-00 |
| 16. ఏక్ కలీ ఖిల్ ఉఠీ | 15-00 |
| 17. పూర్ణాహుతి | 15-00 |
| 18. మేరీ జీవనయాత్రా ప్రథమ భాగం (టంగుటూరి ప్రకాశంగారి ఆత్మకథ) | 8-00 |
| 19. టూట్ తీ పరంపరాయేం | 15-00 |

# उच्च शिक्षा और शोध संस्थान के प्रकाशन

| | |
|---|---|
| 1. हिन्दी भाषा की सामाजिक भूमिका<br>डा. भोलानाथ तिवारी और मुकुल प्रियदर्शिनी | 25–00 |
| ,, ,, विद्यार्थी संस्करण | 12–00 |
| 2. तुलनात्मक साहित्य की भूमिका<br>डॉ. इन्द्रनाथ चौधुरी | 40–00 |
| ,, ,, विद्यार्थी संस्करण | 25–00 |
| 3. व्यावसायिक हिन्दी<br>डॉ. दिलीप सिंह | 20–00 |
| ,, ,, विद्यार्थी संस्करण | 8–00 |
| 4. अनुवाद अवधारणा और अनुप्रयोग<br>संपादक : डॉ. चन्द्रभान रावत और डॉ. दिलीप सिंह | 50–00 |
| 5. शैलीतत्व : सिद्धान्त और व्यवहार<br>संपादक : डॉ. चन्द्रभान रावत और डॉ. दिलीप सिंह | 75–00 |

Edited, Printed and Published by S. T. Vasnta on behalf of the D.-
Prachar Sabha - Andhra Khairatabad, Hyderabad-500 00